# మహాభారత కౌరవరంగము

( నాటకము )



ఇది

"బ్రహ్మఋషి" ఉమర్ ఆలీషా కవిగారిచే

రచింపఁబడినది.



శ్రీ విజ్ఞాన విద్యా పీఠము

పిఠాపురము

తూ॥ గో॥ జిల్లా

**1988**

# ప్రార్థన

క. అల్లా గొల్చెదను రసూ
లల్లా మహమద్ పయంబరాకృతిగా రా
జిల్లు ప్రవక్తల దలంచెద
నుల్లములో జ్ఞానతేజ ముదయము నొందన్

# శ్రీ ఉమర్ ఆలీషా కవిగారి
# జీవిత సంగ్రహము

ఉమర్ ఆలీషా మహాకవిగారు పిఠాపురమున క్రీ శ 1885 వ సం॥రంలో జన్మించిరి వీరి తండ్రిగారు మొహర్షి మొహియద్దీన్ బాషా గురువర్యులు, వీరి జనని చాన్బియాంబ

వీరి తండ్రిగారు అరబ్బీ, పారశీక, సంస్కృతాంధ్ర పండితులు, ఆధ్యాత్మిక విద్యాపీఠాచార్యులు, ఆత్మవిద్యాసారంగదులు. వీరి కుటుంబము పూర్వమునుండియు భాషాపాండిత్యమునకు, ఆధ్యాత్మిక విద్యా సంపత్తికిని ప్రఖ్యాతిగాంచినది శ్రీకవిగారు చిన్ననాడే సంస్కృతాంధ్రములు విశేషముగా నభ్యసించిరి తదుపరి అరబ్బీ పారశీకాంగ్ల భాషలు నేర్చిరి వీరుఆంగ్లమున వ్రాయుట, మాట్లాడుట యెఱుంగుదురు ;కాని ఆంగ్లపద్య కావ్యములందు ఎంతమాత్రము వీరికి ప్రవేశము లేదు. వీరు సహజకవులు వీరి 14వ వర్షమున తెనుగున ధారాళముగా కవిత్వముఁ జెప్పిరి వీరి18వ యేట"మణిమాల"యను నాటకము వ్రాసి అచ్చొత్తించిరి. అది షేక్స్పియర్ మహాకవి నాటకమువలెనున్నదని అప్పటి పత్రికలు కొనియాడినవి వీరి కనేకచోట్ల ఉద్యోగములిచ్చెదమని ఆహ్వానించినను వాని కంగీకరింపక భాషాసేవ దేశ సేవఁజేయుచు తమ జీవితమును గడిపిరి వీరు 1934వ సంవత్సరము డిశంబరు నెలలో అఖిల భారత శాసనసభకు సభ్యులైరి ఆపదవి వీరి మరణము వరకు నుండెను.

వీరికి International Academi of America వారు 1936 సం॥న Doctor of Literature బిరుదు మొఁసగిరి శ్రీకవిగారు వంశపారంపర్యముగా వచ్చుచున్న ఆధ్యాత్మిక విద్యాపీఠమునకు ఆచార్యులై పదహారు వేల జనమును శిష్యులుగా నొనర్చిరి

వీరి యౌగికజ్ఞానమును కొనియాడుచు జ్ఞానసభ సభ్యులు వీరికి బ్రహ్మర్షి బిరుదు మొసంగిరి వీరిసతీమణి అగ్బరుబీబీగారు వీరితో ఢిల్లీ నగరము వెళ్ళి ది. 5-4-35న దివిసలంకరించిరి. ఆదినమున ఢిల్లీశాసన

సభ మూయఁబడెను వీరి గతించినప్పుడు వీరికి అయిదుగురు కుమార్లు యిరువురు కుమార్తెలు పెక్కురు పౌత్రపౌత్రికలుండిరి.

శ్రీకవిగారు జీవిత చరిత్ర ప్రత్యేక పుస్తకముగా వ్రాయుబడు చున్నది. వీరు రచించిన సూఫి వేదాంతగ్రంధమందు వీరు జీవితము సంగ్రహముగా నిట్లువ్రాసిరి.

— స్వీ య ము —

క. ఆ మొహయిద్దీన్ బాద్షా
నామ మహాయోగి కగ్రనందనుఁడను నా
నా మహితాగమ హితవి
ధ్యామతి"ఉమ్రాలిషా" మహాకవి నేనున్.

సీ. రచియించినాఁడ విభ్రాజితదివ్యప్ర
బంధముల్ పది కావ్య బంధములుగ
వ్రాసిన నాఁడను కల్పనాసక్త మతిపది
నాటకంబులను కర్ణాటుఫక్కి
కూర్చినాఁడను కళాకోవిదుల్ కొనియాడ
నవలలుపది నవ నవల లనఁగ
తెలిగించినాఁడ నుద్దీపితాఖండ పా
రసి కావ్యములు పది రసికులలర

తే. రసము పెంపార నవధానక్రమములందు
ఆశులవులయందు పాటలయందు కవిత
చెప్పినాఁడ నుపన్యాస సీమలెక్కి
యవని "ఉమ్రాలిషాకవి" యనఁగ నేను.

ఉ. రాజుఁల జూచితిన్ సుకవిరాజుల నోర్చితిఁ బేరుమ్రోయరా
రాజులఁ నోలగంబుల విరాజితపండిత సత్కవీంద్ర వి
భ్రాజిత మౌలవిబిరుద పట్టములందితి యూనివర్సిటిన్
దేజముమీఱ సభ్యుడయితిన్ మతబోధకుఁడైతిఁ గ్రమఁబన్

ఉ వ్యాసములన్ విమర్శనలు భావకవిత్వరసైక చారు వి
న్యాసములన్ మతాంతరమహాపరివర్తన తత్త్వరూపకో
పాసనముల్ పురాణములు వ్రాసితి భారతభూమి నే నుప
న్యాసము లిచ్చుచున్ దిరిగినాఁడను "ఉమ్రలిషా" కవీంద్రుఁడన్.

ఉ వేలురచించి విద్యలకుబెట్టి గడించితి పారితోషికా
ద్యాళిని వేయినూట పదియార్లను సింహతలాడముల్ మహా
ఖీలకసత్కళాకనక విశ్రుతముల్ జయభేరి మ్రోయ హిం
తాల వసీకటుత్కకవితండము లేమిటి లెక్కమాకడన్

సీ సాధించితిని యోగసాధనంబుల హిమా
గమ మెక్కి మఠిని చక్కాడియాడి,
బోధించితిని జ్ఞానసాధనక్రమములు
చెవినిల్లుగాఁ జేసి చెప్పి చెప్పి,
నవరించితిని పెద్దసారస్వతంబును
శబ్దశాస్త్రంబులు జదివిచదివి ;
చూపించితిని రాజ్యలోపంబు లాంగ్ల ప్ర
భుత్వంబు ముంగరమోపి మోపి

తే ఇప్పుడప్పుడె నలుబది యేండ్లపైన
దాఁటిపోయెను వయసు నీనాటకైన
శాంతి గలుగదు నీ కళాధ్వాంతమందు
జీవితము తెన్ను నుడిబోవు నావబోలు.

మ నను నిజ్ఞానమహాసభాసదులు నానందాన నర్థించి 'ఆ
దిని మీపూర్వపితామహుల్ గురువులై దివ్యత్వమేపారఁగా
ఘనవిజ్ఞానకళా ప్రవృషి ప్రజహృత్కాంతారముల్ నింపి రా
మని మీరాకృతి బోధసేయఁదగు 'ఉమ్రాలీషా' బాషాగతిన్.

మ. అని నెయ్యంబునఁ గోరఁగావిని మహాహర్షంబు సంధిల్ల నా
నని యా జ్ఞానమహాసభాకథన మత్యంతంబు కష్టంబు మే
దిని నంసారనిమగ్న మానసులు నర్థింపంగ సాధ్యంబు గా
దని యున్నంత నెఱుంగసేతునని నే నారంభమున్జేసితిన్.

ఉ. భారతదేశ శాసనసభా సభికత్వపదంబుఁ జేర నేఁ
గోరఁగ జ్ఞాన సభ్యులు నకుంఠితదీక్ష జగంబు మెచ్చఁగా
భూరితప స్సమాధి తమ బుద్ధిని నిల్పి జయంబుఁ దెచ్చినా
రారయ జ్ఞానశక్తికి నజాండము కంపిలుచుండుఁ జూచితే.

చ కవిత నెఱుంగనట్టి పృథుకాలము వ్రాసితి పుస్తకంబు లా
కవిత నెఱింగి వ్రాయుటకు గంటమురాదు, నుపన్యసించు నా
దినముల విద్యతోఁ గలసి తృప్తిఘటించెడు వాని నిప్పుడో
లవము నుపన్యసించుటకు లజ్జఘటించెడు నేమిచెప్పుదున్.

శా. ఢిల్లి భారతశాసనైకసభ యూఢిన్ ప్రాతినిధ్యంబు సం
ధిల్లన్‌జేరెమహత్తరోజ్జ్వలకళాధిక్యంబురంజిల్ల వి
ద్వల్లో బున రాజకీయకలనావ్యాపార పారంగతం
బెల్లన్ వేట్కను నిర్వహించుచును నేనీగ్రంథమున్ *వ్రాసితిన్.

ఉ. ఏమహిమాలయంబుపయి కెక్కి తపస్వులఁ జూచి వారి వి
జ్ఞానములన్ గ్రహించి విజనంబగుచోట రచించినాఁడ నా
నా నవ కావ్యమార్గము లనంతముగా హృదయాంతరంగ వి
జ్ఞానము విశ్వరూపముగఁ గన్పడునట్లు దృశంబు మార్చుచున్.

శా నాలోనున్నవి నేనుజూచినవి విజ్ఞానంబులై లోకమం
దాలోకింపఁగ రాని యీ యమరవిద్యాతత్త్వమర్మంబు లం
దేలోటున్ జనియింప దీశ్వర రహస్యైకైక మీమార్గమే
మేలా దాచెదమంచుఁ జెప్పితిమి మీరిద్ధాత్ములై తేరఁగన్.

కం మా తాతయు మాతండ్రియు
ఖ్యాతిని అఖైలలీ మహాగురువర వి
ద్యాతత్త్వము నేర్చిరి త
ద్రీతుల వివరింతు యోగరీతులు తెలియన్.

## — ♦ అ గ్బ రా ం బ ♦ —

శా. ఆ ఢిల్లీ నగరాంగ్ల శాసన సభాభ్యర్థిత్వ మర్థింపఁ డం
చాడన్ నేను కృతార్థుఁడై జనిన నాకై వచ్చి ప్రాణంబులున్
వీడెన్ నాసతి అగ్బరాంబిక చిలత్ విద్యుల్లతన్ బోలె ; యీ
నాఁ డేనశ్రులు 'గోరె' పైవిడ చుచు న్వర్తింతు నిర్జీవినై

ఉ ఏను రచించినట్టి కృతు లెన్నిఁటినో వినె తల్లి ; తండ్రి నా
నా నవనాటక ప్రకరణంబులు నాఁడగ జూచినారు ; ఢి
ల్లీ నగ రాంగ్ల భారతమహీధవ శాసనసభ్య సత్పదం
బానఁగ గాంచి 'అగ్బ' రమరాలయమేగె వెలుంగుచుక్కయై.

---

* సూఫీవేదాంతదర్శము

శా. ఎన్నో బాధలు బొందుచుండు మని నన్నీ భూమివర్జించి యా
పున్నెంపుంగని అగ్బరేఁగె దివికిన్ బూర్ణేందుబింబంబు వా
ర్ధి న్నిద్రింపగ బోయిన ట్లిఁక మహాంధీభూత మాలిన్య సం
ఛన్నాత్మన్వనిపిద్ధజీవిత మభాసం బెన్న నా ళ్ళుండినన్.

సీ. ఏమాట చెప్పిన నెదురాఁడగా లేదు
పరమసాధ్వీత్వంబు వరలుకతన
ప్రాణాల నర్పించి పరిచర్యలను జేసె
పరమహర్షంబు ముందరను నిలువ
కలిమిలేములను నొక్కటిగాఁగ గణియించె
నిత్యకళ్యాణంబు నెలకొనంగ
ఏవురు కొడుకుల నిద్దరు కూఁతుల
ననిశంబు దీవించి నాత్మశాంతి

తే ప్రతిదినంబు చదువు ఖురాన్నమాజు
శౌచశీలాన నలువది వత్సరములు
ధరణి జీవించి స్వర్గాన కరిగె అగ్బ
రాంబ దివిజులు నీరాజనంబులిడఁగ.

చం పరమపవిత్ర యీ వెలది పండితురాలు నితాంత సత్యసం
భరిత రసాత్మక ప్రకృతి వడికిబారెడు ప్రేమమూర్తి సుం
దర సముపాసితం బయిన ధర్మపదంబును సంతరించి యీ
శ్వరునెద నగ్బరాంబ కడు ప్రార్థనసేయుచు నెల్ల వేళనన్.

శా. పల్లెన్ బుట్టిన ఢిల్లిలో బ్రిటీషుసామ్రాజ్యంబు పాలించు వా
రెల్లన్ వచ్చి సమాధిజేసిరి భవన్మృత్యున్ విచారించి యో
ఫుల్లాబ్జానన 'అగ్బరాంబిక' భవత్పుణ్యంబు దేశాల రా
జిల్లున్ విచ్చిన కుండఁబోలె వెస నే జీరాడుచున్నా నిటన్

చం. హృదయము ముక్కలౌనటుల నేడ్చుచుఁగన్నులనీరు కాల్వలై
చెదరఁగ నిమ్న లోకములఁ జేరుటకంటె సమాధితొంటి నీ
సదనము చేరుమార్గము విచారణజేయుట లెస్సయైహిక
స్పద విభవానుషంగభవబంధమువాసిన నిన్ను చూడఁగన్.

శ్రీ కవిగారు యిస్లాంమతస్థులు.వీలు మాతృభాషఉర్దూ. ఆంధ్ర భాష మాతృభాషగా కానివారు తెనుఁగున సరసకవిత్వముఁ జెప్పిన వారు ఈకవిగారొక్కరే వీరు రచించిన మహాభారత కౌరవరంగ మను నాటకమున___

నాటకముల్ ప్రబంధము లనంతముగా రచియించి వాణి కా
వ్యాటవి భానవీధుల విహార మొనర్ప జయధ్వజంబు వా
గ్వాటిని నిల్పినట్టి జనవిశ్రుత ఉంరలీషా కవీంద్రుడున్...."

అనివ్రాసిరి.

వీరు రచించిన గ్రంధము లేబదివరకున్నవి. శ్రీ కవిగారు తమ శిష్యులకు దర్శన మిచ్చుటకై నరసాపురము (పశ్చిమగోదావరిజిల్లా) వెళ్ళి అచ్చట ది 23జనవరి 1945వ నాటి సాయంత్రము 5గంటలకు దివి నలంకరించిరి వీరి భౌతికదేహమును పిఠాపురముఁ దెచ్చి 24వ తేదీ సాయంత్రము రైలుస్టేషనువద్ద నున్నవారి యరామములో సమాధి చేసిరి.

# BRAHMARISHI
# DR. UMER ALISHA
## TELUGU POET.

"A really great man has ideas always greater than himself" This is more true of Dr. Umer Ali Shah, the immortal poet of the Telugu language, than anyone else He was born in March 1887 in Pittapuram, a town in the Andhra State of India

Though he had no proper education he developed a great taste for Telugu which was not his mother tongue, and began writing varse when he wase a teenager The qenius of the boy was at once recognized by Telugu scholars and his fame grew as a poet by the time he was 18

He wrote plays in Telugu which can only find a arrallel in Shakespeare's Many Hindu poets and scholars began to pay tribute to this Muslim poet of the Telugulanguage and regarded him as a itern-poet in the Carlylian senes of the word

His writings took a new shape in all branches of literature Besides poetry he wrote novels, plays and essays which excelled the writinas of the renowhed Telugu scholars of the twentieth century, and so on his Works found a Permanent place in the annals of Telugu literature,

Today he standes alone like a pole star guiding those who are interested in Telugu literature, and he is acknowledgde as their great master who brought a change over literary forms in Telugu

He also made fresh departures in almost every form of literature His poetry has no parallel in Telugu, despite the grate writers whose works no doubt come nearer to his standard, and yet, lack that charm and cadence, lucidity and masterly style both in narration and criticism

His vast knowledge of Sanskrit in Which language also he was a scholar, contributed effectively towards his prodigious efforts in Telugu with his contribufion Telugu leterature would be nowhere as rich as it is today

What Shakespeare is to the English, what Dante is to the Italians What Dr Iqbal is to Urdu speaking Muslims, Dr Umer Ali shah is to the Hindus of Andhra

His writings have no other parallel, as I stated before, in any other literature of the world, becase they are the creation of one man. He hed to his credit such a vast bulk of written work in all literary forms that no one author in English or any other language could have produced.

But alas ! It is confined to Andhra, and Andhra only, and its great merit lies hidden outside the state even in india, not to speak of foreign countries.

Yet his reputation, by a curious twist of fate, soared aloft

In 1936 the International Acadamy of America confirmed upon him the degree to doctor of literature for his thesis in Telugu For a man with no university edncation to obtain such a high degree from the new world is certainly a matter of pride to the individual as well as to the province in which he was born

His was no ordinary intellent, thought he knew little English when compared to his ability in Telugu and Sanskrit

His works in Telugu are clear evidence of what he struggled for, lived for and clied for He was out and out a nationalist purposed to reform the people around him culturally, socially economiclly, and politically, and accordingly he rendered youngman service to humanity at large duing that little span of his meteoric rice.

He did everything in his capacity His School of thought pervaded all his works and helped remove the dogmatic ideas and beilefs of the ignorant and the illiterate and led them to the supreme path of glory and virtue.

This Won for him a saintly honour and he came to be regarded by all Hindus as a saint His Writings spelled tha qualities of a great seer

Though he Was a Muslim, tha magnanimity of the Hindus could not deprive him of what he was in truth, not did they (the Hindus) leave him in the lunch, but nursed his genius tenderly till it gave them the best of the life they needed And he did not disappoint them.

Dr Umer Ali Shah Was also a social reformer in his own environs He had reformed the Hindus, customs and manners by aint of his profound knowlege of Sanskrit and the Hundu philosophy which he had mastered

He know more them any Hindu scholar of his day He could recite slokas so fluently and so correctly intepret them in Telugu that the pundits were stunned at his mastery

All Hindus of Andhra admit that he had surpassed all in every branch of Telugu literature and he came to be regarded as the only eminent poet in modern times in that language

His writings created a sensation throught Telugu speaking areas both within and outside Andhra State, indian universites adopted his works in their curricular for degree classes and no librarv is without his books

His political career overlapped his literery one and he was so engrossed in both that it is very difficult to think of the one without the other

During the last decade of his life his literary fame was at its higheot while his political activities continued till his daeth

He had to make mady trips every year from south to north to be presence ni the Legislative Assembly at Delhi from the time when he was elected independently in 1935 From them on he used to repair to the hill-tops of simla to invoke the muse and produce his master-pieces in Telugu literature, even in his political travails

Apart from his literary acties, his political career was also remarkable He was known as a good politician. Mahatma Gandhi accepted him as a man with sound political ideas when he was in congress upto 1935

He worked for the nation unhesitatingly during the khilafat movement and was held in high esteem by all the national leaders of those times His assemble speeches contained sound principles of integrity and magnanimity and therefore saw the press of his day

Besides, he worked for the good of the country deliverig lectures everywhere irrespective of religian, cast or creed with a

view to promoting goodwill amongst the people for which he was adored by Muslims and Hindus alike

When he wase preoccupied with political afairs and wheu his literery fame Was at its zenith, he was suddenly shaken by a tragic event His beloved wife Akbarbebi died Delhi in April 1935 when he wase attending the sessions

This shock are into his vitals and he breathed his last in January 1945 after a cerebral hemorrhage in a village of Narsapur

His body was brought for burial or Pittapuram where every year congregational meetings are held for one week by his 20 000 disciples including emident poets and scholars of Andhra state in honour of their great hero-poet and he lies forever enshrined in their hearts.

—**M. N. HUDA**



చ సుదతి మహాపతివ్రత ని
శుద్ధచరిత్ర పవిత్రగాత్ర నూ
డిదవలె పోల్చి నాకయి క
డింది భరంపడి హస్తినాపురిన్
హృదయము వ్రక్కలింప దివి
కేగిన నాసతి 'అగ్బరాంబ' కే
నిడి కురురంగ సత్కృతిని
నిచ్చెద తర్పణమిచ్చు కైవడిన్.



"బ్రహ్మఋషి" ఉమర్ ఆలీషా
శ్రీ అగ్బ్రా రా ం బ

క.	జగమున ధర్మము నెలకొ
ల్పఁగ నీస్వరుఁ డొక్క దివ్యవ్యక్తినిఁ బంపున్
యుగ యుగమున నాతఁడె యీ
సగునాత్మకుఁడైన సారసాక్షుఁడు గంటె.



# "బ్రహ్మఋషి" ఉమర్ ఆలీషా

చ	అణువులయందు సుందర యజాండమునందు హిమాంబు సూక్ష్మపుం
గణములయందు సూర్యశశికాంతులయందు పరాత్పరా భవ
ద్వినుత విలాసవైఖరి ప్రవీణతఁ దోఁచుచు నున్నదింకనిన్
గనుగొన లేనిచో కనులు గల్గిన నంధులుగారె మానవుల్.

# పరంజ్యోతి



పడిన కష్టాలు పాటవంబలతిగాక !
సడలిపోయిన సౌఖ్యాలు స్మరణ రాగ
మాశిపోయిన మాటలు మరపురాక
పాటపాడిన పదములు పలుకలేక
వెడలిపోయిన కాలంబు వెదకుచుంటి
వెతుకుచుంటి నామరుగునే వెతకుచుంటి
తెలుసుకొంటి నామరుగునే తెలుసుకొంటి
తిరిగి కాలంబురారని తెలుసుకొంటి (జన్మ)
లేదు పరతంత్రమికనాకు లేనెలేదు
లేదు నాయన్న మౌఢ్యంబు లేనెలేదు
స్వార్థమున నీప్రకృతి నాకు స్వస్తి జెప్ప
భ్రాంతిలోగన్న విషయ విభ్రాంతిగాగ
పోవుచుంటి నాదారినే పోవుచుంటి
కాననంబులో పురములో కానరాని
ఆ అయోమయ మధ్వాన్నమైన దారి
అప్రళయకాల దందయ్యుమైన యట్టి
చిమ్మ చీకట్లు చెంగట చేరి చేరి
జరిగిపోయె సహస్రులు జగములోన
దాటిపోయెను మెన్నులా దారిలోన
స్వర్గ నరకాల వీధులాశ్చర్యముగను
దారులివ్వగ వాటిని దాటి నిలచి
చూచినా నది నిజముగ శూన్యజగము
కలతబడి మనో దుఃఖాన గలయజూడ
అంతదురాన నేదియో నవతరించె
అందులో రూపమేదో నాకానుచుండె
అందు బ్రహ్మాండములును రూపొందుచుండె
ఎవరిదారూపు నాకపుడెరుక బడియె
అధియె నా గురుని స్వరూపమవధిగాను

అతడె ఆత్మై లతీషుడు అది నిజంబు
అదియు ప్రేమైక రసరూప మవ్యయంబు
వెలువడెను గాడెనందుండి వెలుగదేదో
నిండెనా వెల్గు జగముల నిండె నిజము
నిండె నావెల్గు నాలోన నిండె నిజము
నిండి నాలోన జతనావ మండిపోవ
నిలిచె సంతృప్తిం నాలోన నిలిచిపోవ
ఇమిడె ప్రమదంబు నాలోన నిమిడిపోవ
తెలిసె జగములు "నేన" ని తెలిసిపోయె
నేనె "విశ్వంబు" విశ్వంబు నేనె నిజము
నిజము యీ దృశ్యమంతయు "నేనె" నిజము
గగనములలోన నారూపె గానుపించె
భాస్కరునియందు నారూపె బరగుచుండె
సలిలమందును నారూపె సాగుచుండె
ఈవసుందర నారూపె యనగుచుండె
అరయ వాయువులో నిండినదిగో దోచె
అదిగో వైశ్వానరుని నిండెనదిగో చూడు
ఎన్ని చెప్పుదు సర్వంబు "నేను" గాను
సృష్టినంతయు నాలోనె చూచినాడ
ఇదే పరంజ్యోతియన సొప్పు నీ వెలుంగు
ఇదియె యోగులుగన్నట్టి జ్యోతి సుమ్ము
నిలచిపోదు నీ జ్యోతి నేనెప్పటికిని
నిలచేపోయి నీ జ్యోతి నేనెప్పటికిని
రాను మిముజూడ వాంఛనే రాను రాను
తిరిగివచ్చెడి నాశలు తీరిపోయె
నెడలి వచ్చిన మాటలు వేరు లేవు
లీనమగుదు నీ జ్యోతిని నేనుగానె!
మరచిపొండింక నారాక మఱచిపొండు
వదలివేయుడు దర్భలు వదలునట్లు
విడచివేయుడు ధారను విడచునట్లు
ఇట్లు "హుస్సేనుషా కవి ఎరుక జెప్పె!



"బ్రహ్మఋషి" శ్రీ హుస్సేన్ షా

శ్రీ విజ్ఞాన విద్యాపీఠాచార్య

పిఠాపురము

# శ్రీ విజ్ఞాన విద్యాపీఠాశయం

శ్రీ విజ్ఞాన విద్యాపీఠమహర్షి జ్ఞానవేదమూర్తులు శ్రీ శ్రీ హుస్సేన్‌షా కవి కృతంషాతత్వసంహితము యీశ్వరవాణిగా పలికి ఈశ్వరవాణిగా విశ్వ మానవకోటికి శ్రీ విజ్ఞానవిద్యాపీఠ మహాసభాసభ్యులకు అమితానందముగచేయుచు భౌతికవిధానమందు అనేక జీవిత విశేషములకులోనై విరక్తిభావము శారీరకముగా కలుగుటవలన మానసిక విశేషమును, పురస్కరించుకొని ధర్మప్రబోధమును గావించి మానవుని మానవుడుగా మార్చుటయే యీ ధర్మముయొక్క లక్ష్యము అనగా శ్రీవిజ్ఞాన విద్యాపీఠముయొక్క విశేషము ఇది సృష్టివుద్భవించి, యుగ యుగాలుగా, తరతరాలు సృష్టిలో శాఖోపశాఖలుగా ఏకేశ్వరోపాసనచేయుచు, కృతి, స్మృతిలోస్మృతిగాపాడుచు జాతిమత విచక్షణలేక యదార్ధమైన రసస్వ రూపము శ్రీపీఠాచార్యు నిమంత్రప్రభావముచేత జీవిఆత్మపరిణామము అభౌతిక మైనటువంటి దృశ్యరూపములో చిత్రించుటయే శ్రీవిజ్ఞాన విద్యాపీఠముయొక్క లక్షణము. దాని యదార్ధ ధర్మవిషయము ఇదిఆచరించి అనుసరించినవారికి అనుక్షణము లోకవిషయవాంఛలను దూరముచేసి సంకల్పసిద్ధిఁజేయును

# పద్య రత్నములు

1) సీ॥ తరతరంబులనుండి తాతతండ్రులుమున్న
విజ్ఞాన విషయంబు వివిదవిదము
మణులు మాణిక్యముల్ మదిని బడయునట్లు
సర్గపదార్ధద్వయము సంగ్రహించి
వివిధదేశంబులు వెడలి సభ్యకులము
వినుతిగావించి రావిశ్వమూర్తి

ఆధ్యాత్మవిద్యల కాకరం బగు మహా
జ్ఞానశ_క్తిని తవశ్శ_క్తిబడసి

తే॥ గీ॥ ధర్మమనునేమి యో దెల్పి దరణికెగసి
అమృతకరులై బోదకాధ్యాపకులుగ
నుండి పీరికాపురమందు నోలగముల
ప్రభువులై యుండి రాహి "షా" వంశభవులు

2) ఉ॥ అన్నిటికన్న గొప్పమహిమాస్పదమైన మహత్మ్యముండు, నిం
దున్నది అ "షతత్వ"మనె న_త్తమగ్రందము దైవదత్తమై
సన్నుతమై పవిత్రమయి శాసనమై సచరాచరంబులో
నున్న రహస్యముల్ దెలుపుచున్నది యీశ్వరవాణిసృష్టికిన్

3) తే॥ గీ॥ ఇట్టి విజ్ఞానమతము నర్దించి ప్రేమ
పారములునేర్పి విజ్ఞాన పక్కి గూర్చి
మానవోద్ధార కుండన మహినివెలసి
మలినములుమాపె "హుస్సన్‌షా" మౌనివరుడు

4) తే॥ గీ॥ ఏదావేవెల్గు షాతత్వ నేగుదెంచి
అందులోన హుసనుషా కృతవతరించి
వచ్చినిలిచె తేజంబుగ వసుదయందు
దెచ్చితిని నీకిదేయని తేటపరచె

5) తే॥ గీ॥ వేలు లక్షలు శిష్యులు పాలుగూడి
ప్రజ, లజ్ఞానతిమిరంబు బారద్రోలి
భద్రమార్గమే కేశ్వరోపాసనంబు
ననుచు చాటిరి హృదయడక్కానుభూతి

పంచరత్నములు సమా_ప్తము

(పీరాచార్య)




ఈ "మహాభారతకౌరవరంగము" అను నీనాటకము పాండవకౌరవులకుఁ గల నైతిక స్థానిక సంప్రదాయాది ప్రసిద్ధధర్మములు నిష్పాక్షికముగా నిరామాటముగా భారతవ్యక్తిత్వమును ప్రతిపాదించునట్లు చారిత్రకపుఁబునాదులపై స్వాభావికముగను ధర్మయుక్తముగను నిర్వివాదముగను నుండు పక్కని విమర్శించి 1916 వ సంవత్సరప్రాంతమున వ్రాసితిని దీనినిగుఱించి ఆదినములలో నెన్నియో యుపన్యాసముల పూర్వపక్కని చెప్పుచుండెడివాఁడను ఇంచలి పెక్కురంగము లనేకపత్రికలలోఁ బ్రకటింపఁ బడినది ఈయాశయములపై నెందఱో నెన్నోవిధముల పరివర్తనములు చేసినారు

నేను చిరకాలమై వ్రాసిన ఈపుస్తకము తిరిగిసవరించి వ్రాయుఁడని కొందరన్నారు కాని నాకిష్టములేకపోయినది తప్పొప్పులు అభిప్రాయభేదములు కాలము నిర్ణయింపవలసియుండును

నాసతి అగ్బరాంబ డిల్లీపురమునకు నేను అఖిలభారతశాసనమహాసభా సభ్యుఁడనై వెళ్లినప్పుడు హఠాత్తుగా ఢిల్లీలో ది 5-4-1936 సం॥న దివి నలంకరించెను ఆమె జ్ఞాపకార్థ మీకృతి కృతిగా నొసంగితిని

ఇట్లు

**ఉమర్ ఆలీషాకవి**

ఎం ఎల్ ఎ

శ్రీ విజ్ఞాన విద్యాపీఠము

## —• ఇందువచ్చు పాత్రలు •—

| పురుషులు | స్త్రీలు |
| --- | --- |
| ధృతరాష్ట్రుడు | కుంతి |
| భీష్ముడు | |
| దుర్యోధనుడు | ద్రౌపది |
| దుశ్శాసనుడు | |
| కర్ణుడు | ఉత్తర |
| శకుని | |
| శ్రీకృష్ణుడు | |
| దేవేంద్రుడు | |
| ధర్మరాజు | |
| భీముడు | |
| అర్జునుడు | |
| నకులుడు | |
| సహదేవుడు | |
| అభిమన్యుడు | |
| బలరాముడు | |
| అశ్వత్థామ | |
| కృపాచార్యులు | |
| శృతకీర్తి | |
| కృతశర్మ | |
| వ్యాఘ్రభట్టు | |
| సుజాతుడు | |
| ధనగుప్తుడు | |
| బ్రాహ్మణులు, సేవకులు. | |

# మహాభారతకౌరవరంగము



## నాంది

ఉ. ఏదిచరాచరంబయి యతీంద్రియమై పదునాల్గులోకముల్
కాదనకొక్క రేవపయి గ్రాలఁగఁజేసెనొ యేది సూర్యచం
ద్రాదిఖగోళరాజ్యముల కంతకుఁ గేంద్రమునైన తేజమో
ఆదయితాస్వరూపమఖిలార్థము లిచ్చును మీకు నిత్యమున్

నాద్యంతరము

సూత్ర—నటీ! నీవొకసారి యిటురమ్ము

నటి—(ప్రవేశించి) నాథా! యేమి యీకోలాహలము

సూత్ర—

ఉ. భారతదేశమెప్డు తనభ్రాతృలతోఁ గలహించి పోరదు
ర్వారరణంబునన్ మడసి రక్తముద్రావెనొ యాచరిత్ర యా
భారతసంహితన్ దెలియఁ బల్కెడు నాటక మిప్పుడాడు చు
న్నారని చూడవచ్చిన జనంబిది యేగతి మెప్పఁజేతువో

నటి—ఈనాటక మెవరు వ్రాసినారు.

సూత్ర—

ఉ. నాటకముల్ ప్రబంధము లనంతముగా రచియించి వాణికా
వ్యాటవి భావవేధుల విహారమొనర్చ జయధ్వజంబు వా
గ్వాటిని నిల్పినట్టి జనవిశ్రుతు ఉంరలిపాకవీంద్రుఁడున్
బాటవమొప్పవ్రాసె నల భారతసంహిత నాటకంబుగన్.

నటి—ఇది యెవరు ప్రకటించినారు

సూత్ర—శ్రీవిజ్ఞాన విద్యాపీఠసభాసభ్యులు

నటి—ఈమహాభారతము నాటకములుగా నెందరో వ్రాసినారుగదామఱల యేలవ్రాయవలయును?

చ తెలుఁగున మూఁడుపర్వము లుదీర్ణత నన్నయభట్టు భారతం
బలర రచించినాఁడని మహావినమోక్తుల గౌరవించి యా
తెలుఁగును మాని తక్కినవె తిక్కనవ్రాసె పదేనుపర్వముల్
నెలకొని యట్టిగౌరవము నేఁటికవీంద్రుల కేలలేవొకో?

సూత్ర—అగును నటీ! ఇందొకసంగతి యున్నది

ఉ భారతసంహితన్ జదువు వారలు తత్కథ నంతొ యింతొ యే
ధోరణినో రచించి పరిధూతమలీమసులై తదీయ వి
స్ఫారసుధాస్రవంతులను క్షాళణమైనపునాదులందు నీ
భారతసౌధమున్ నిలుపవచ్చునటంచు దలంతురెంతయున్

నటి—అగు నిది నిక్కము మహాభారత మపురూపమహాతదార్థము ఈనాటకము వ్రాసినకవి "కౌరవరంగ" మని పేరుంచెనేల?

సూత్ర—ఏదో యొక క్రొత్త పెరుండవలయును గదా! అదిగాక కౌరవపక్షమైన ధర్మము లోకమెఱుంగవలయు ననునది కూడ యొక విషయము

నటి—అది యేమి? వ్యాసమహర్షి యెఱుంగనియర్థ మీకవిపుంగవు లెఱుంగుదురా! ఆహా! ఏమి యీవిపరీతము

సూత్ర—ఇందేమియు విపరీతము లేదు

ఉ. భారత మర్ధమున్‌దెలిసి పల్కెడువారలు ముజ్జగంబులన్
లేరు విపాదవీచికల నెవ్వగఁ జెందెడువారె గాని యె
వ్వారు తరింప లేరయిరి వ్యాసుని దివ్యకవిత్వతత్త్వ వి
స్ఫారసుధాసముద్రము నపారము జీవయుతంబు నెచ్చెలీ

నటి—అగును వ్యాసభారత మేకపక్షపాతిమనే చిత్రించెనందు రది యేమిటి? ఇది మిగుల నూత్న విషయము

సూత్ర—కావచ్చును

ఉ. భారతమెల్ల పాండవులపక్షము దర్మముపల్కెనన్న వా
గ్ధోరణెగాని కౌరవులతో సరిపోల్చిన పాండవుల్ దురా
చారులు నీతిబాహ్యులని చాటకచాటె జయాంకవ్యాస వి
ద్వారచనాచమత్కృతి యనంత మగాధ మనూహ్యమారయన్.

నటి— అది యెట్లు?

సూత్ర—వ్యాసభగవానుఁడు మహాభారతసంహితయందు పాండవులఁ బొగడినాఁడన్న మాటయేగాని నిజముగా పాండవుల పత్సమాసిపోవునట్లు దుంపత్రెంపివేసి తుదకు పనికిమాలిన పలుగాకులని పర్యవసానము తేల్చినాఁడు కౌరవుల భారతజాతీయత కాదర్శముచేసిన ట్లున్నది అదే ఆమహర్షి రచనాచమత్కారములోని మహారహస్యము.

నటి—ఇది యెట్లు తెలిసినది

సూత్ర—

తే. గీ. వ్యాసభారతసంహితావార్ధి విమల
సుజల వాసనావేసితశోభ, రెండ

పదియగు కురుప్రతిమయందె ప్రతిఫలించు
దాని నీనాటకంబునఁ గానవచ్చు

నటి—ఈనిగూఢమే కొలఁదియైన లోక మేలగ్రహింపక కలహించు చున్నారు?

సూత్ర—పరిజ్ఞాతలగువా రెఱుంగక పోలేదు

నటి—ఇదిచాల విచిత్రమైన సంగతి.

సూత్ర—

ఉ భారతదేశమందు ప్రతి వ్యక్తియు నైతికపుం బునాదులా
ధారముజేసి జీవితవిధానము మార్చి మతస్వరూప సం
స్కారములందు బెట్టెనదె సత్కృతులందుఁ జరిత్రలందు ని
ద్ధారణఁజేసి రయ్యవి యుదాహరణంబులుగాగ జాతికిన్

నటి—అట్టి సర్వజనసామాన్యమైన సిద్ధాంతములంత నిగూఢముగా నుం వచ్చునా?

సూత్ర—కూడదు. ఇట్టి అపరిజ్ఞాతృత్వ మేకాలమందుగూడ కలదు

తే గీ చేటెడు వసుందరను నియ్యఁగోరి వేడ్క
నడుగవచ్చిన శ్రీకృష్ణు నంతవాని
కౌరవులుపట్టి బంధింపఁ గోరినారు
యింతకన్న విచిత్ర మింకేమియుండు.



# మహాభారతకౌరవరంగము

## ప్రథమాంకము

రంగము - సభామంటపము

(దృతరాష్ట్రుఁడు, భీష్మ్రుఁడు, ద్రోణుఁడు, దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, కర్ణుఁడు, శకుని, విదురుఁడు, ప్రవేశించియుందురు )

దృత—ఎన్నివిధముల యోజించినను నిదమిత్థమని కర్తవ్యమే తోఁచకున్నది ఎన్నఁడో గడచిపోయిన యుధిష్ఠిరయువరాజుపట్టాభిషేక మసంగతమను పెద్ద వివాదము దినదినము పెచ్చుపెరిఁగి పోవుచున్నది

దుర్యో—పదునైదేండ్లవయసుగల ధర్మజాదులను త్రివిష్టపమునుండి వెంటగొని వచ్చి పాండు పత్నియగు కుంతిచేఁ దనపుత్త్రులని నిర్వచింపఁబడినంత మాత్రమున కౌరవరాజ్య యువపట్టముగట్టి కుడివి కూర్చుండకక యీకుమ్మరము దెచ్చిపెట్టిరి నాఁడే వారలఁబొమ్మన్న నేఁడీ జ్యూతాది పరాభవపరివర్తన ప్రకారములైన నపవాదముల కాస్పదమే యుండెడిది గాదుకదా ?

భీష్మ—అదియట్లు జరుగవలసి యున్నది

కర్ణు —యుధిష్ఠిరయువరాజ పట్టాభిషేకము కురురాజ్యమునఁ గౌంతేయులకుఁ గాలుయోపు నవకాశ మిచ్చినది అదియట్లు జరుగనిచో పాండవులు రాజసూయమే కాదు పేరైన లేకుండఁ బోయెడివారు

భీష్మ—నీవెఱుఁగవు, ఆయుదంతములు వేరుగ నున్నవి.

విదు — అగును.

దుర్యో—ఏమగును ఏకుమేకైన తెఱంగున వారన్ని విధాల మనతెత్తిక్కి పోయినారు.

ధృత—

ఉ పరఁగా సుధాంశుఁడాది కడువన్నెయు వాసియుఁ గాంచినట్టి యీ
పరమ పవిత్రమౌ భరతవంశము నేటికి నిష్కళంకమై
వరలుచు వచ్చుచున్నది ప్రవాహవిధంబున నింక మీఁద వి
డ్డురములు నేమి పుట్టునో కుటుంబ మహాకలహార్ణవంబునన్

భీష్మ—నిజము, నిజము. సమరమునకంటె సమాధానమే సమంజసమైనది శ్రేయోదాయక మైనది.

ద్రోణ—భీష్మాచార్యుని నిర్వచనములతి నిగూఢములు, పరమధర్మపరాయణ ములు మహనీయములు

ఉ అంచితవైరభావ మడుగంట హితాగమముల్ సతంబుఁ బు
ష్పించుచు చారుమానసికసీమల రాగరసంబు నింపుచో
వంచనయందె ప్రేమయును పారమునేర్చిన యట్టులుండు వ
ర్షించిన నీరు ముత్యములు సేయవె శుక్తికలాత్మశుద్ధిచేన్.

విదు—అగునిది లోకకల్యాణము కాదా.

దుర్యో—జగచ్ఛ్రేయోదాయకమైన ధర్మస్వరూపపుఁ బునాదులే మీరురూపు మాపి వేసినారు

భీష్మ—అట్లనఁ జెల్లదు

కర్ణ—ఏలచెల్లదు. యుధిష్ఠరున కజాతశత్రువని బిరుదిచ్చిననాఁడే యధర్మ దేవత గజ్జెలందెల దిక్కుంభికుంభాల నాట్యమాడినది.

దుర్యో—యుధిష్ఠిరయువపట్టముతో

కర్ణ—జయహారతి వెలిగించినది

దుశ్శా— ఈపని యీకురుపితామహు లేల కావించిరి ?

కర్ణు—కురువంశమునుండి రాజ్యము తొలఁగింప నుద్దేశించి రటగదా

ద్రోణు—లేదు లేదు అవి మిథ్యాపవాదములు

విదు—నాఁ డాపాదించిన విపత్తు నుత్తరించుట కట్టి యుపాయ మాలోచింప వలసి వచ్చినది

దుర్యో—అనఁగా

విదు—

మ ధరణీరాజ్యము నొక్కవంశమున నిత్యంబుండు కంటెన్ సము
ద్ధరతన్ మాఱి ప్రజాప్రభుత్వమున కత్యంతంబు లోనై పర
స్పర సంగ్రామ వివర్జితంబయిన స్వేచ్ఛన్ దెచ్చుచింతన్ యుధి
ష్ఠిరునిన్ నిల్పితి మట్లుకానిచో కురు శ్రీయుండ దీనాఁటికిన్

కర్ణు— ఆహా ! యెంత సాహసము చేసితిరి మీరెంతకైనఁ దగుదురు

దుర్యో—మేముండఁగాఁ బ్రజాప్రభుత్వమా

తే గీ సింహముల ద్రోలి యట గ్రామసింహములను
పరమహంసలఁ బోకార్చి బకములకును
రత్నముల మాన్పి వెలలేని రాళ్లతతికి
స్థానమిచ్చిన శోభింపఁజాలు నొక్కొ

దుశ్శా—ఆ స్వాతంత్ర్య* మెవరికున్నది ?

విదు—ఎవరికున్నను మీరిటుల కలహింపక మానరు

దుర్యో—కలహకారణములు కల్పించి పైగా ఈదర్యోపదేశము లేమి ప్రయోజనము ?

విదు—సుయోధనా ! ప్రశాంతుఁడవై యవరోధములు నివారించుకొనుము

దుర్యో—అవక్రపరాక్రమక్రమమున జగచ్చక్ర మేకఛత్రాధికారముగ నేలుచున్న మాకిపు డేమి యవరోధము వచ్చినది ?

శకుని—వచ్చును పాండవుల పక్షమాడుటకుఁ గృష్ణుఁడు రాయబారియై కలహమునకుఁ బునాదు వేయ బయలుదేరినట్లు వేగులవలన విన వచ్చినది.

దుర్యో—సరే ! ఆ పాండవహతకు లెందైనాఁ బడి చావనిమ్ము లేదా చింతలచేఁ జివికి నశించనిమ్ము మనకు విచారమేల ? మనకును వారికిని నేమి సంబంధము వారు పాండవులు, మనము కౌర వులము

దృత—అన్నా ! సుయోధనకుమారా ! వంశవర్ధనుఁడవైన నీవట్లనఁజెల్లునా ? నీకోప మపనయించుకొని కర్తవ్యాకర్తవ్యములు లెస్సగవిచారించి యీ కురుకులమహానౌకను నిప్పు డెదురైన విపత్సముద్రమునుండి తరింపసేయుము తండ్రీ ! ఈ కలిమి మనకు శాశ్వతము గాదు

మ సిరియన్ రాజ్యము కానికాలమున విచ్ఛిన్నంబులై పోవు దు
ర్భరదారిద్ర్యవిపన్నిమగ్నులకు రారాజాధిపత్యంబుచే
కురు రాజన్యకుమారకోటిచెడి భిక్షోహం నమోయంచుఁ బో
వు రమాదేవి సతంబె లేదనుచు దేవుల్లాడినన్ వచ్చునే

భీష్మ—నాయనా ! సుయోధనా ! పితృవాక్యపరిపాలనము మిగులశ్రేయో దాయకము జైవాత్రకుఁడవైన నీవు కౌరవరాజ్యమునకు ననుశ్రుతా గతమై గంగాసలిలమువలె స్వచ్ఛమై సుధాశరశ్చంద్ర చంద్రికాభమైన కీర్తిని ప్రపంచరంగమున నాచంద్రార్కము గావింపుము తండ్రీ !

శా. అన్నా ! యెందఱు వచ్చి యీధరణి రాజ్యంబేలి కాలాహతిన్
మన్నై పోయిరి యెంతలేసి ఘనులన్ మాయించె నీ భూమి సం
పన్నత్వంబును రాజ్యమున్ స్థిరములే స్వప్నాభముల్ ప్రాప్తమే
తెన్నోపోవు విషాదనాటకలు రత్నీభపాత్ర లి మానవుల్.

విదు—అగు నిది నిక్కము ఈ జగము మిథ్యాస్వరూపము

ఉ ఎందఱొవచ్చినారు దరనెందరొ రాజ్యములేలి పోయినా
రం దొకరైనఁ గానఁ గానఁబడ రక్కట యెక్కడికేగినారొ యా
చందమెదోఁచదెవ్వరు నిజంబుగ ధర్మము దప్పలేదొ వా
రందఱ సచ్చరిత్రుల యదార్థములే మరలేదు లోకమున్

కర్ణ—అగును ధర్మాతిక్రమణ మొనర్చిన మీచరిత్రములును లోకము
మఱచిపోఁ జాలదు

భీష్మ—కర్ణా! కౌరవమహాసభ నిట్లతిక్రమమర్యాదుఁడవై మాటలాడవచ్చునా!
మేమొనర్చిన నధర్మమేది ?

కర్ణ—ఏదా ?

మ కురువంశంబునఁ బుట్టినట్టి భరతక్షోణీశ లెల్లన్ బరం
పరగాఁ బుత్రుల కిచ్చినారు తమ సర్వస్వంబు రాజ్యంబు, నా
తెఱఁగున్ మాని కులాంతరుండు సమవర్తిన్ ధర్మజున్ దెచ్చి యిం
దరు దూరన్ యువరాజుజేసి రిది యేనా ధర్మసందేశముల్

దుశ్శా—ఇది మాకై బయలుదేరిన విడ్డూరము

కర్ణ—అగును

తే గీ రాజు ధృతరాష్ట్రుఁ డలయువరాజు మా సు
యోధనుఁడు జన్మచే నగుచుండ నింక
పాండుసుతుఁ డేమి యువరాజు పట్టమేమి
కురుకులంబిట్లు దుర్నీతికూల్చినారు

భీష్మ—లేదు

విదు—పాండుసుతుల కెప్పటికైన నర్ధరాజ్యము వదలిపెట్టుట న్యాయ
సమ్మతము కాదా ?

దుశ్శా—కాదు పాండవులకీ కురురాజ్యమున నొకకాసైన రానేరదు

దుర్యో—అగును

ద్రోణ—ఏల రాఁజాలరు

దుశ్శా—అవి మీఱెఱుంగని ధర్మములుకావు

తే గీ పాండురాజన్న సేనాధిపతియతండు
పాండుపుత్రులు సరియైనవారుగారు
ధర్మమరుదింద్రభిషజుల తనయు లగుట
కురుమహారాజ్య మేరీతిఁ గోరఁగలరు

శకు—అది మన యసమర్థత

భీష్మ—ఈ వితర్కము చర్వితచర్వణము

దుర్యో—చర్వితచర్వణమేగాని హృదయశల్యమైన దీని నేనాఁటికిని మఱవ వలసినదియును మఱపువచ్చెడిదియును గాదు

కర్ణ—అగును

భీష్మ—మఱియు నిది గతజలసేతుబంధనము. యువరాజపట్టము ధర్మజునకుఁ గట్టినప్పు డిఁకఁ గురురాజ్యమునఁ బాలు లేదనుటెట్లు సంప టించును ?

కర్ణ—ఇది సుయోధనున కన్యాయముసేయుట కాదా ?

ద్రోణ—ఆ రంగము గడచిపోయినది.

దుర్యో—ఉత్తరరంగములుగూడ నిట్లే యుండుననుకొనవలదా ?

కర్ణ—ఈ సుయోధనుఁడు మహారాజాధిరాజగు ధృతరాష్ట్రుని యగ్రనంద నుఁడు గుణవంతుఁడు గాంధారివంటి మహాపతివ్రతాశిరో మణికిఁ బుట్టిన బలశాలి దాత ఏకపత్నీవ్రతుడు సకలకళా కోవిదుఁడగునీతని ద్రోసిపుచ్చి ఆహా ! అయోగ్యుఁడు. మృషావాది కులసంప్రదాయములులేని గుణహీనుఁడు అయిదుగురు కలిసి యొకతె నుంచుకొన్న యనాచారులలో నొకఁడగు నొకతులువ

మహోజ్జ్వలదరిచేఁజిరకాలానుగతయశః పరిశోభితయగు భరతమహారాజ్య మేకఛత్రాధికారముగా నేలించి యధమాధముఁడగు నా యుధిష్ఠిరుని శకనాదునిచేయ నూహించిన మీ విపరీతవిప్రయత్న ములు నిందాపాత్రములు గర్హ్యములు దోషదూషితములు పండితుల వలె ధర్మప్రసంగములు చేయుచున్నారేగాని పెరుగు తోటికూరలోని పెరుగువలె మీలో దర్మలేశము వెదకినను నూసునకైననుఁ గాన రాకున్నది మిమ్ముఁ జూచి లోకమెట్లు నిందించుచున్నదో విచారింప కున్నారు ఇప్పుడు మీరు తిన్నయింటిని మన్నుచేయఁ దలపెట్టు చున్నారు కాదా! పాండవులవంటి కులద్రోహులను వెనుకవేసి కొనివచ్చు మీకు విశ్వాసములేదు కృతజ్ఞతలేదు దర్మములేదు మీరే యీ కౌరవంశవినాశనమునకు నగాధములగు పెద్దగోఁతులు తీయుచున్నారు

శకు—నిజము నిజము

ధృత—శకునీ! నీవు మహానుభావులైన భీష్మాదులను నడ్డుదూరుచున్నవా? ఊరకొనుము

కర్ణు—ఊరకొనుటచేతనే యీదురాగతపరంపరలు ప్రాప్తమయి ప్రాణాం తకము లగుచున్నవి

భీష్మ—అంగరాజా! యేల నీకీ వృదాప్రసంగములు? మాలో మేము సవరించుకొనవలసిన గృహకలహంబులకు నీ జోక్యమేమున్నది నీవు దూరముగా నుండుము

విదు—కర్ణా! యీ కురురాజ్యమునకు ముఖ్యుఁడును ఔరసుఁడును బాహు బలపరాక్రమశాలియు నగు నీ సుయోధనుఁడే యువరాజును రారాజును కావలసినది. కానీ నాఁటిరాజకీయ విషవివర్తముల ననుసరించి యుధిష్ఠిరు నిలిపి యింద్రప్రస్థ మియ్యవలసి వచ్చినది.

దుర్యో—కావుననే మేము పరాభవింపఁబడితిమి

విదు—మీపరాభవము పాండవుల పదభ్రష్టులను జేసివేసినది గాదా ?

కర్ణు—ఆ చింత మీకెంతో వేదించుచున్నట్టున్నది

విదు—మాకేమిచింత ?

దుశ్శా—మఱియేల యీయధర్మమున కొడిగట్టితిరి

విదు—అనుల్లంఘ్యంబైన నాఁటి ప్రమాదముల నుద్దేశించి ధర్మజుని యువరాజును చేయనియెడల, అర్జునుని జనకుఁడును త్రివిష్టపాదిపతియు నగు నింద్రునితోట్పాటుగల పాండవులు కురుకులమును నీరుచేసి ప్రాజ్యమైన యీ రాజ్యమును నాఁడే దిగమ్రింగివేసియుందురు

భీష్మ—అగును

దుర్యో—ఇవి మీయూహలు

శకు—ప్రజలు మోసపుచ్చు పన్నుగడలు

భీష్మ—కావు ! నీవేటుంగవు వినుము ఆ పాండవులు భువనబ్రహ్మాండములు బెగ్గడిలునట్టి రాజసూయయాగమున కుపయోగించిన నసాధారణ సమరపరికరములే మన కురురాజ్యముపైఁబెట్టి పేరును ఊరును లేకుండ పాతాళమునకు దిగద్రొక్కివేసి యుందురు.

దుర్యో—అట్లనుకొనుట జడభావము

కర్ణు—ఈ సంగతి గాంగేయునకుఁ గృష్ణుఁడు చెప్పియుండును.

దౌవారికుఁడు—(ప్రవేశించి) జయము జయము మహారాజా ! శ్రీకృష్ణ భగవానులు వచ్చి హజారమున వేచియున్నారు.

ధృత—ఓహో ! సాక్షాచ్ఛ్రీకృష్ణభగవానులే స్వయముగా విచ్చేసినారా! వేగము పోయి తోడ్కొనిరండు

విదు—మహాభాగ్యము (అని వెళ్లును )

(శ్రీకృష్ణుఁడు ప్రవేశించును అందరును లేచి యర్ఘ్యాసనమిచ్చి కూర్చుండురు )

ధృత—దేవకీనందనా! నీదర్శనమహాభాగ్యము నేఁడయాచితముగ మా పుణ్యవశమున లభించినది మేమెంతయుఁ జరితార్థుల మైతిమి మా జన్మములు తరించినవి మేము ధన్యుల మైతిమి

భీష్మ—(లేచి నమస్కరించి) దేవా! నందనందనా!

చ ఎవరి గృహాంగణంబులకు నెవ్వనియూరికి సేవనాళికిన్
భవదమలాంఘ్రిపద్మములు వచ్చునొ వాఁడవి పూతమై సదా
భవభయరాగ రోషములు, వాయుఁ గృతార్థతఁజెందు నింక నే
స్తవ మొనరింపఁగాఁగలనె దానవభంజన లోక రంజనా

కృష్ణ—సర్వజ్ఞుఁడును పితామహుఁడునునగు భీష్మసహిత కురువృద్ధ గురువృద్ధ బుధ బంధుహిత పరివేష్టితమైన యీనిండోలగమును నేఁడు దర్శించి దన్యుఁడ నైతిని మీ యందరి కభివందనములు

దుర్యో—బావగారి కింతకాలమునకు దయవచ్చి విచ్చేసినారు మాకిది శుభదినము

కృష్ణ—మీకు సర్వశ్రేయ మగుగాక

కర్ణ—ఈ వాసుదేవుఁ డెందుకొరకు వచ్చెనో ముందాయుదంత మడుగుము

కృష్ణ—మీ యొద్దకు నేనెప్పుడొక బాంధవునివలెఁగాక రాయబారినై వచ్చితిని.

దుర్యో—ఎవరి పక్షమున

దుశ్శా—పాండవపక్షమున

శకుని — మీరందరొక గూఁటివారే

కర్ణ—"పాండవపక్షపాతి" యను బిరుదము గౌరవప్రదమని భావించు కృష్ణుఁ డెవరికి రాయబారియై వచ్చును.

విదు—(లేచి) కేశవా ! నీ నిజరూపమెఱుంగుట దుస్తరము

ఉ నీవు మహానుభావుఁడవు నీవు దివంబు జగంబు జంగమ
స్థావరరూపక ప్రకృతి సర్వము నీవు చరాచరంబు నీ
వై వివిధార్థముల్ కలుగునట్లు నటించు త్వదీయ దివ్యతే
జోవిభవంబు మాదృశులు ప్రొక్కి నుతింపఁగలేరు కేశవా

ధృత — అగును మహనీయుఁడగు కృష్ణునంతటివాఁడు తెచ్చిన సందేశము పరమపూజ్యము వేదసదృశము. అవశ్య మాచరణీయము ఆనతిమ్ము మహానుభావా ! ఆనతిమ్ము

శకు—ఈ కృష్ణుఁడు మహాభారత యుద్ధమునకుఁ బునాదులు వేయ వచ్చినాఁడు

దుశ్శా—నీకెట్లు తెలిసినది మామా

శకు—సూర్యు నెఱుంగుట కద్దమును ఆఁకలినెఱుంగుటకు నిమంటువును కావలయునా ?

భీష్మ—ఈ శ్రీకృష్ణుఁడు మానవమాత్రుఁడు గాఁడు వీని యాదేశములు సంభావ్యములు అనుల్లంఘ్యములు.

క జగమున ధర్మము నెలకొ
ల్పఁగ నీశ్వరుఁ డొక్క దివ్యవ్యక్తినిఁ బంపున్
యుగయుగమున నాతఁడె యీ
సగుణాత్మకుఁడైన సారసాక్షుఁడు గంటే

ధృత—నిజము నిజము

దుర్యో—మాధవా ! నీరాయబారమేమి ?

కర్ణ—రాయబారులగువారు మన యాచనతో నిమిత్తము లేకుండచెప్ప వచ్చినవన్నియు ప్రాయికముగా నేఁకరవుపెట్టియే వెళ్లిపోయెదరు వానికై మన వినయవినమిత దీనాలాప పరికరశతంబులతోఁ బనిలేదు.

దుశ్శా—అగును

తే గీ మేఘములు వచ్చి గర్జించి మెఱసిపోవు
బ్రమరములు వచ్చి గీతముల్ పాడి పోవు
వెల్లువలు వచ్చి ఘోరని వెడలిపోవు
నట్టె రాయబారులు వచ్చి యరుగుచుంద్రు

శకు—తే గీ పక్షు లేతెంచి వనమునఁ బాడిపాడి
యెగిరిపోవును వనమట్టె యెసఁగుచుండు
మేఘములు వచ్చి గర్జించి మెఱసి మెఱసి
పోవు నాకాశమట్టె ప్రమోద మొందు

కర్ణ—కాని యొకానొకప్పుడు

తే గీ ప్రజల భూకంపములు వచ్చి పాడుసేయు
తోఁకచుక్కలు పొడిచి చీకాకు సేయు
పెల్లువలు వచ్చి సస్యాలు పొల్లుసేయు
నట్టె రాయబారులు జనవ్యథలు గూర్తు

శకు—ఈ కృష్ణులందుకే యేతెంచిరి

కృష్ణ—శకునీ నీవట్లు భావించుట సమంజసముగాదు

ఉ ఏను వచించు సంగతులు నెంతయు నారసి మంచివైన మీ
మానసముల్ గరంచినఁ బ్రమాదములేనియెడన్ బ్రసన్నులై
ధీనిధులార! పాండవుల దీనతఁ బాపుఁడు నన్నదమ్ములం
దానకలేని పోని కలహంబులు వచ్చిననేమి మేలగున్

దృత—నిజము నిజము నందనందనా! నీయభిమతానుసారము గావింపుము

భీష్మ—నీయభిమతమే పరమధర్మము. పరాయణము

దుర్యో—కృష్ణా! విషయమేమి?

కృష్ణు—అవహితుఁడవై వినుము

శా మీకున్ నెయ్యముగూర్చు సోదరులు మీమేలెంచు చుట్టాలు మి
మ్మేకాలంబును గొల్చు పాండవులు మీయిష్టంబునన్ గానలో
నేకాంతంబునఁ బేర్లుమార్చి పదమూఁడేండ్లుండి నేఁడర్ధరా
జ్యాకాంక్షన్ మిముగోర నన్ననిపినారర్థిన్ బ్రసాదింపఁగన్

దుర్యో—(దిగ్గున లేచి) ఏమి యీ కృష్ణుని వెడఁగుమాటలు (పై పద్యముచదివి) ఇట్టి విపరీతము లీ కౌరవ మహా యోదానయోధులుగల యీ సభా మంటపమున నిట్లు నిరామాటముగాఁ దెగనాఁడవలసినదేనా! ఆ తులువలు ఆ పాండవ హతకులు మాకు చుట్టములా! పాపము శాంతించునుగాక

కర్ణు—తరువాత, తరువాత కృష్ణా! యింకను నీ సందేశనందలి విశేషములేమి?

కృష్ణు—ఇదియే ముఖ్యమైన విషయము

తే గీ అర్ధరాజ్యం బొసంగుట న్యాయమగును
నటుల నిడకున్న నైదూళ్లనైన నిడుఁడు
నదియు నిడకున్నఁ బూట భత్యం బొసంగి
పాండవుల మీరు పోషింపవలసియుండు

శకు—కృష్ణా! నీవు సర్వజ్ఞుఁడవు ఘటనాఘడనసమర్ధుఁడవైయ్యును నిట్టి విపతరాయబారమునకుఁ గడంగుట మిగుల శోచనీయమైన సంగతి

దుశ్శా—ఇది మంచిరాయబారమే. ఇట్టివిలోకము విని నవ్వుననుశంకైనఁ గలుగలేదా ?

కర్ణు—కృష్ణా! నీవు నిజముగ రాయబారమునకే వచ్చితివా కాదుసుమా! కేవలం కయ్యమునకుఁ గాలుదువ్వుటకై వచ్చితివి.

కృష్ణ—(చిరునగవుతో) కష్యమె కానున్న కాఁగలవానిని నెవరాపగలరు

దుశ్శా—చతుస్సముద్రముద్రిత మహామహనీయమైన మా రాజ్యసర్వస్వము నందు సగపాలు గోరినవారు వారిపోటనే పూటభత్యమడుగుదురా! యిది యేదో కపటనాటకము కానోపును

కర్ణ—కాదా! ఆ పాండవమధ్యముఁడు బాహుబలపరాక్రమశాలినని తిరస్కృత పురందరాది దిక్పాలకుఁడ నని ఆలోకనమాత్రమున మూఁడులోకములు భస్మీపటలముసేయఁజాలినమేటి వీరాధివీరుఁడనని పేరు చెప్పినంతనే పంచభూతాత్మకమైన యీ యజాండము ఈ పదునాలుగు భువన బ్రహ్మాండము లొక్కపెట్టున చుట్టుకొని పోవునని పేరుమోసినవాఁడనని నివాతకాలకేయకవచాదులనాలములోఁ ద్రోలినవాఁడనని నివాతకాల కేయకవచాదులనాలములోఁ ద్రోలినవాఁడనని మిడిసిపడువాఁడు, ఇంత స్వాభిమానమును లజ్జను పరిత్యజించి మాయొద్ద పూటభత్యమునకుఁ గొలువుండెదనని కబురంపునా! యిది యెంత విపరీతమైన సంగతి

దుర్యో—కృష్ణా! నీవు మమ్ము నిజముగా నెగతాళి సేయుటకు వచ్చితివికాని వెరుగాదు

తే గీ గొల్లకన్యలతోఁగూడి గోపబాల
కాళితోఁగూడి సతమెగతాళిసేయు
చును దినంబులుగడిపిన సొగసుకాఁడ
వీవు మమ్మట్లు గేలిగావింతు వెపుడు

కృష్ణ—సుయోధనా! యిది యెగతాళిగాదు ముమ్మాటికిని నిజము

విదు—సాక్షాద్విష్ణ్వంశసంభూతుఁ డగుమహాపురుషుఁడు. ఈ శ్రీ కృష్ణుని మాట లెగతాళి యని యనుటయే యెగతాళి యనిపించుకొనును

కృష్ణ—సుధర్మాసనమును బురుడించు నీభద్రసింహాసనమున ధృత రాష్ట్రుఁడును ఈరేడుజగంబులకు పితామహుఁడైన భీష్ముఁడును

కర్ణసుయోధనాదికోదండవిదులైన మహామహులకు నెలవైన యీ కొలువునందు పాండవభాగము నడుగవచ్చితిని కలదో లేదో చెప్పి పంపుడు ఇందులోఁ దగువేమున్నది

శకు—పాండవు లొనరింపవలసిన పదమూఁడేడుల ప్రవాసము ముగియలేదు

కృష్ణ—అన్యాయము లాడవలదు

తే గీ పంచభూతంబులును జగత్ప్రకృతిధర్మ
మంతరాత్మయు సూర్యచంద్రాదిదివిజ
వర్గ మంతయు మానవవర్తనంబు
గనుచునున్నారు తన్నాఁచికొనఁగఁ దరమె.

దుర్యో—కృష్ణా! నీవన్నదెల్లరకొక్కటే ఆ పాండవపంచకము మాయెడ నొనరించిన యపకృతిఁ దలంచిన నాయొడలు భగ్గునమండిపోవు చున్నది కావున వారి యుబుసు మాయెదుట మఱి తేవలదు. వారిచే మేము చాల నొచ్చి యున్నాము చూడుము

సీ రారాజుగా ధృతరాష్ట్రుఁడుండఁగ పాండ
వులు రాజసూయంబు సలుపఁ దగునె
యువరాజు నేనుండ యువరాజ పట్టంబు
నెనసి ధర్మజుఁడెక్క యేలఁదగునె
చుట్టాల మయసభఁబెట్టి వంచనఁజేసి
నెవ్వగ ద్రోవది నవ్వఁదగునె
ద్యూతంబులో రాజ్యమోడి వెలదినోడి
మాపైని నిందలు మోపదగునె

గీ. యమునలో మమ్ము ముంచితా మరుగఁదగునె
మోటపట్టులలో మమ్ము మొత్తఁదగునె

యందసంతతియని మమ్ము నాడఁదగునె
గోగ్రహణమందు మాసిగల్ కోయఁదగునె
ఇంక నిట్టి వెన్నియో కలవు

కర్ణు—అగును

తే గీ శకుని కర్ణ సుయోధ దుశ్శాసనులను
మనల దుష్టచతుష్టయ మనుచుఁ జెప్పి
తాము ధర్మాత్ములగుటకుఁ దలఁచినారు
ప్రక్కలో బల్లెములుగారె పాండు సుతులు

దుర్యో—సందేహమేమి

మ నను దుర్యోధనుఁడంచు నాయనుజునిన్ వంచింప దుశ్శాసనుం
డని నాసోదరి దుస్సలంచు కడునింద్యంబైన పేర్లుంచి జీ
వన రాజ్యంబులు ద్రొబ్బి భారతకదన్ వ్రాయించి మాపై నసూ
యను గల్గించిరి ధాత్రిఁ బాండవులు బోషారంభసంరంభులై

కర్ణు—అంతటితో వారి ప్రయత్నములు ముగియలేదు
శకు—అగును ఏవో విప్లవోద్యమము లూహించుచున్నట్లు లగుపడుచున్నది.
దుశ్శా—విరట్రాజు నాశ్రయించియున్నా రది నిజమై యుండవచ్చును.

కర్ణు—వారలేమి చేసినను చేయఁగలరు

ఉ జూదరులాసవప్రియులు సూనశరాహతి నేవు రొక్కటై
కాదన కొక్కకాంతతమకంబునఁ గన్నిడికట్టుకొన్నను
న్మాదులు పాపవిత్తులు ప్రమాదశతంబులఁజేసి కౌరవా
పాదిత రాజ్యమున్బడయ వచ్చుచునుండిరి పాండవాధముల్

దు—అటులైన మనమును జాగరూకులమై యుండుట శ్రేయము
కృష్ణు—సుయోధనా! నీవు పూర్వవైరమును పరిత్యజించి లేనిపోని నిందారోపణములు సేయక కర్తవ్య మనుసరింపుము. పాండవులే

మీయెడల మహాపరాధము లాచరించినా రనుకొనుము వారు నీవనినట్లు మిక్కిలి దోషదూషితమైన దురాగతము లాలోచించిరే యనుకొనుము అవి అన్నియుఁ జర్వితచర్వణమువలె నిప్పుడేఁ కరువెట్టిన లాభము లేదు వారిప్పుడు నోడఁబడి మీనెయ్య మపేక్షించి వచ్చినారు వారి కేదేనియొక మార్గ మగపర్చుము నీకు ఆచంద్రార్కమై విలసిల్లు కీర్తి యుండిపోవును

దృత—నాయనా ! సుయోదనా ! శ్రీకృష్ణసంతటి మహానుభావుఁ డడుగవచ్చి నప్పుడు శరీరమైనా కోసి యియ్యవలయునుసుమా మన కురువంశమున జనించినవా రెల్లరు నడిగిన యర్థము లేదనక నిచ్చినారు సంప్రదాయ సిద్ధమైన కులమర్యాదను నిలుపవలయును సుమా తండ్రీ !

సుయో—కృష్ణా ! నీవు వచించునట్లు పాండవులకుఁ దిరిగి మా రాజధానియందు ప్రవేశము గలిగించినయెడల మేము దక్కఁగలమను విశ్వాసము మాకు లేదు

శా. మా రాజ్యంబును మా ప్రజావళిని మా మాన్యంబులన్ గోవులన్
వారే యాచించుకొనగనే ర్తు రది తద్యంబేము భిక్షార్థమై
యే రాజ్యానకొ లేచి పోవయునంతే మాదుసంతానముల్
చేరును గొఱ్ఱెలవెంటఁ దోలుచు కురుక్షేత్రాంట వీవిధులన్

కర్ణు—అట్లెందఱు దురవస్థల పాలై పోవలేదు ఇప్పుడు నీవీకృష్ణుని మాయ మాటలకు లోనై మోసపోయితివేని బహుకష్టముల కాకరమైన వైతరణిం బోలు యమబాధలకు నీ సంతతి నప్పగించిన వాఁడ వయ్యెదవు

తే. గీ. సూదివలె దూరి మెల్లఁగాఁ చొఱవఁజేసి
దబ్బలమువలెఁ బైకి రాఁదలఁచువారు

మేకవన్నెల పులులట్లు మెలఁగు పాండ
వులు పయోముఖవిషకుంభములు నిజంబు

కృష్ణు— కర్ణా! ఏటి కీయతిప్రసంగములు పాండవులేనా విషకుంభములు
దుర్యో—అగును
కృష్ణు—మీరుగారా ?

మ విషమన్నంబునుఁబెట్టి చంపుటకునై విశ్వప్రయత్నంబు క
ల్మష చిత్తంబునఁజేసి పాండవధామార్గంబుఁ జింతించి నీ
తృషమున్ దీర్చుకొనంగ నెంచితివిగాదే తోడివారెల్ల పౌ
రుషమా! యంచును నిన్ను నవ్వనిది నీ రూపంబు దుర్యోధనా

దుర్యో—సరే! కృష్ణా! యిపుడు నీవు దొరకిపోయితివి

మ విషమన్నంబునుఁబెట్టి చంపుటకై విశ్వప్రయత్నంబు క
ల్మషచిత్తంబునఁజేసి పాండవవధామార్గంబు జింతించి మా
తృషమున్ దీర్చుకొనంగ నెంచితిమిగాదే తోడివారెల్ల పౌ
రుషమాయంచును మమ్ము నవ్వ నివి మా రూపంబులో కేశవా.

కావున నీవన్నదే నిజము విషాన్నముపెట్టి పాండవవధామార్గమును నన్వేషించి భగ్నమనోరథులమైన మాయొద్దకే పూటభత్యమైన పాండవులకుఁ గుడువఁబెట్టుఁడని యాచింపుచు వచ్చితివే యిపుడు మేము విషముమాని అమృతాన్నము పెట్టెదమని యెట్లు నమ్మితివి? ఎట్లు పొసఁగుననుకొంటివి? ఇది యంతయుఁ గపటరాయబారముగాదా?

కర్ణు—అగును మొదటినుండియును కద కపటముగనే నడచుచున్నది
దు—ఈకృష్ణుఁడు తిరిగి ప్రాఁతపడిన మనోరథములను కెలుకుటకు పరతెంచి నాఁడేగాని రెండవదిగాదు

ఆ గీ దాయభాగమునకు దగువార లెవ్వరో
యెవరు తగరొ కృష్ణుఁ డెఱుఁగఁడొక్కొ

కౌరవులకు నైన యీరాజ్యమును పాండు
తనయు లెట్లు పంచుకొనఁగలారు

కృష్ణ—సుయోధనా! ఇది నీవనవలసినమాటయేనా! మీ కురురాజ్యమేస్థితి నుండి యేస్థితికి వచ్చినదో దీని విస్తీర్ణము తొలుత నెంతగలదో యిప్పు డెంతయున్నదో యిది యంతయు నెవరి నిరంతర పరిశ్రమావిశేషమునఁ బెఱిగినదో యించుకైన విచారించితివా! అయ్యో!

మ కురురాజ్యంబన నెంతగద్దు భరతక్షోణిన్, భవత్ పాండుభూ
వరుఁడున్ దిగ్జయ మాచరించి జలధి ప్రాకారమై యొప్పు నీ
ధరణీరాజులఁ దెచ్చి నీజనకుపాదంబంట మ్రొక్కించి భా
గ్యరమన్ గూర్చెను నేఁడువానిసుతులన్ గర్హింపఁగాఁ బడియే

దుర్యో—అగు నాప్రాయికమైన పితృసంప్రదాయము వీరు మఱచిపోయినారు

దుశ్శా—మఱచుటయే గాదు. అతిక్రమించి కయ్యమునకై సిద్ధ మగుచున్నారు. అయ్యో ఆభీముఁ డెన్నిసార్లు మాపై గద యెత్తి తిరగబడలేదు

దు—అగు నాదురాత్ముఁడే యీయనర్థము లన్నిటికి మూలమైనవాఁడు

దుశ్శా—ఈ తులువలు మనలను కాదని తిరస్కరించి తాము స్వయముగా స్వరాజ్యమునే స్థాపించినారు

దుర్యో—! అట్టివార లెట్టిదండనమునకుఁ బాల్పడుదురో కృష్ణా నీవే యెఱుంగుదువు అయినను మేము సహించి వారి యాతిథ్యమంగీకరించి రాజసూయమునకుఁ బోయి మిగుల పరాభవింపఁ బడితిమి మాపరాభవ ముకన్న ద్రౌపతీ పరాభవ మధికముగాదు.

కృష్ణ—మీరు కావించిన ద్రౌపతీవస్త్రాపహరణము నిజముగా ఆ పరాభవము ఆమెదిగాదు—మీది ఒకయస్వతంత్రయగు నబలను మేటి వీరులును రాజాదిరాజు లనిపించుకొను మీరందరు కలిసి నిండోలగంబున వివస్త్రసేయుటెంతయు లాజ్జాకరము, హైన్యము

కర్ణ—కాదు ద్రౌపది నీవన్నట్టు లబలయే యగునెడల తనయింటికి వచ్చిన చుట్టాలను మయసభ పెట్టి వంచించి దుర్యోధనునంతటి మహారాజును "అందునిపుత్రున కింతకన్న తెలివియా ?" యని యధిక్షేపింపఁగలదా!

దు—(పండ్లుకొఱుకును )

దుశ్శా—లోపములు గలవారే లోపము లెంచెదరు

కర్ణ—

తే గీ మగనికన్నులు లేకున్న మగువకేల
కనులటంచును గంతలు కట్టుకొన్న
వరపతివ్రత గాంధారివంటి గరిత
తనయుఁ డీసుయోధనుఁడని తలఁపవలదె.

కృష్ణ—అది జగద్విఖ్యాతమైన సంగతి

భీష్మ—ఇప్పు డాప్రసంగము లెందుకు సంధివిషయములు సంప్రదింపుఁడు

కర్ణ—ఇది సంధిగాదు విషసంధి.

భీష్మ—కర్ణుఁడా ! నీవు విపరీతము లాడుట మానవుగదా !

కర్ణ—నేనేమి విపరీతములాడతిని ! ఇది సంధియగుటో ద్రోవది తన వస్త్రాపహరణమునాఁడు

చ. జడముడి వీడ ముంగురులు జార వివస్త్రనుజేయఁ దెచ్చిన
ప్పుడు ద్రుపదాత్మజాత యివిపోలదు మీకని చెప్ప దుస్ససే
నుఁడు వినకున్న నీకడుపునున్ బెకలింప త్వదీయరక్తమే
ర్పడఁగ బిరాననాంకురులరాసెదనన్న వ్రతంబు వీడునే.

దుశ్శా—వీడొక్కనకున్న తిరుపతికిఁ బోవుదు

కృష్ణ—ఈధృతరాష్ట్రాది మహామహులచేఁ బరివేష్టితమైన నిండోలగమున నిది రెండవపరాభవము

దుశ్శా—(శకునితో) మామా ! ఆ ద్రౌపది పదమూఁడేండ్లనుండి విప్పిన తలకట్టు లేదట తైలసంస్కారాదులు లేనితల జడలల్లిపోక నెట్లుండునోయి భీతిని కొలువు నామె విరటుని నగరున నెట్లు దాస్యము చేసినది ? ఎట్లా కీచకుఁడు వరించినాడు ?

శకుని — కామమునకు కన్నులులేవు

ఉ కౌరవకాంతలెల్ల గుణగణ్యలు సాధ్వులు శౌచశీల వి
స్తారలు పూరుషుల్ స్వకులదారవిహారులు పాండవుల్ దురా
చారులు వావియున్ వరుస వాలనివారు పరాంగ నారతుల్
వారికి వీరు పోలికకు వత్తురె యేయెడనైన మాధవా !

కృష్ణ—ధృతరాష్ట్రాది మహామహులయెదుట ఈ ప్రసంగములు సరికావు

ధృత—కృష్ణా ! పాండుపుత్రులను నేను గర్హించలేదు నాకొడుకులకన్న నెక్కుడు గారవమున నారయుచున్నాఁడను నాఁడు జూదమున యుధిష్ఠిరుఁడు రాజ్యమంతయు నోడ నే నది యెఱింగి తిరిగి యాతనికే యిప్పించితిని ఆతఁ డది హాయిగా ననుభవింపలేక రెండవసారి జూదమాడి భార్య సహితము సర్వస్వమోడిపోయి దేశాంతరములకు లేఁచి పోయినాఁడు

శకు—కితవుల పనియట్టిదే.

ధృత—మఱియు పాండురాజునెడ నేను కృతఘ్నుఁడఁ గాలేదు.

దుర్యో—కాని తత్పుత్రులకా కృతజ్ఞత లేకపోయినది

శకు—నిజముగా పాండురాజునకుఁ బుట్టినయెడ నుండకపోదు

కర్ణ—రాజుండగనే యువరాజు రాజు కాఁదలంచినాఁడు.

దు—

శా రారాజై ధృతరాష్ట్రుఁ డుండఁగను ది[గ్రా]జ్యంబులన్ గెల్చి తా
మే రాజన్యులమంచు నధ్వరము గావింపంగఁ గర్జంబె యీ
తీరెందున్ గలదే భవాదృశులు బుద్ధిన్ జెప్పి మాన్పించినన్
ఘోరంబుల్ జనియింప వీపగిది సంక్షోభంబు రానేర్చునే

కృష్ణ—సుయోధనా! కడచినదేమో కడచిపోయినది అవి అన్నియు నిపుడుగ్గడింపనేల? నామాట విని పాండవుల కేదేని యొకచిన్నవసతి గల్పించుము అడుగవచ్చిన నాకును, ఇచ్చిననీకును, చిరకాల మాకీర్తి నిలిచిపోవును

ఉ కర్ణుని మాన్పి దానమును గైవసమున్ గొని గంటకట్టి రా
జ్యార్ణవమేలుచుండిన మహామతి వీవొకపాటి భాగమున్
నిర్ణయమున్ బొనర్చు మది నీకు యశంబగు పాండునందనుల్
కర్ణునిపాటివారయిన కాదనరాదు సుయోధనాదిపా

దు—సరేగాని కృష్ణా! యేనీతిని ఏ ధర్మమునుఁ బాటించి నీవిట్టు లడుగుచున్నాఁడవో నేనూహింపఁజాలకున్నాను

మ భరతుం డాదిగ నేఁటిదాఁక కురుసద్వంశంబునన్ బుట్టు భూ
వరు లీరాజ్యము పంచుకొన్నకథ లెవ్వారైన నర్థిన్ వచిం
చిరి యేనిన్ సగపాలెగాదు దరణీసింహాసనం బెల్ల ని
త్తరీమేమిత్తుము గొంకుమాట లిటు విస్తారంబు లింకేటికిన్

కృష్ణ—ఇది యవిభక్తమైన రాజ్యమైనను జ్యేష్ఠానుక్రమములేదు సమన్వయించుకొన్న నేది చేయరాదు ఈ గంగాపుత్త్రుఁడు సోదరులకు సర్వస్వమొసంగివేయలేదా!

దు—మాకుఁ బాండవులట్టి సోదరులు కూడాగారు

ఉ వారికులంబు దేశమును వారివివాహము శౌచశీలముల్
భారతజాతి కాదనుచుఁ బల్కుచునుండగఁ దెల్విమాలి యీ

కౌరవరాజ్య మర్ధమిడఁగాఁ దగునంచును నెట్లు చెప్పఁగా
నేరెదవీవు పాండవుల నేరనివాఁడవె నందనందనా !

కృష్ణ—పాండవులను మీ పట్టములపట్టిక నుండియే తొలఁగింపుచున్నావా ? యెంత సాహసము

శకుని—ఉన్నమాట చెప్పిన నెవరికైనను కష్టముగనే యుండును

తే గీ పెండ్లి కాకమున్నె పిల్లలఁ గన్నది
కుంతి , పెండ్లియాడి కోరి కోరి
పెక్కురకును గన్న పిల్లలు పాండవు
లర్ధరాజ్య మెట్లు లడుగఁగలరు

కుంతి భారతీయాచార సంప్రదాయములకు విరుద్ధమైన నడత నవలంబించి దేశమునకు నెప్పటికిని మాయని మచ్చఁ దెచ్చిపెట్టినది ఇంక వారి నెవరు వంగడమునఁ గలుపుకోగలరు ? కులశీలములు లెక్కించువారికివి మార్గములుగావు భారతవనిత లిట్లెవరును ఏ కాలమందును నింత విచ్చల విడిగ సంచరించు టెఱుఁగరు

భీష్మ—అప్రస్తుతములగు నీప్రసంగము లింతటితోఁ గట్టిపెట్టి కర్తవ్యమునకు రండు

శకుని—నేనాడినది యప్రస్తుతముగాదు కులసంప్రదాయములతో సంబంధించినది లోయికి మాత్రగాని లోకమునకు లేదు కావునఁ బాండవులు కురువంశములోనివారు కారని పరదేశీయులని నేను ఘంటాపథముగఁ జాటి చెప్పుచున్నాను ఏమందువా

చ. సవతిని కోడలిన్ గులము సానులుగా నొనరించి కుంతియీ
భువి నపకీర్తిపాలయి ప్రపుణ్యాపథంబును వీడి యింట నా
సవమును జూదమెద వ్యభిచారములన్ బొనరించియాజ వం
జవమును బెంచి యింటిని బజారుగఁజేసెఁ గులంబు చేట్పడన్

కృష్ణ—బాలు నీవాబాలత్వము కట్టిపెట్టుము ఎవరైన విన్న నవ్విపోదురు మీరందఱుకలిసి యీశ్వరసృష్టినిఁగూడ మఱుగుపరుపఁ జూచు చున్నట్లున్నది ఆహా! యేమి యీ దారుణము శకునీ!

శా మాయజూదము పెట్టి పాండవుల సామ్రాజ్యంబు సర్వంబు మీ
రే యీయంగట వైచికొంటిరి సభన్ గృష్ణన్ సిగన్బట్టి మొ
ఱ్ఱోయం చేడ్చిన మానకీడ్చి వలువల్ ద్రోహాత్ములై విప్పినా
రే! యాదుఃఖము లారలేదపుడె వేరెసాకు లూహించిరే

దు—మేము వేరే క్రొత్త సాకులు కల్పించలేదు

కర్ణు—కృష్ణా! మాయాజూదమనుచుంటివి దానియర్థమేమో విడఁజెప్పుము

కృష్ణ—మీరెఱుంగరా? యింద్రప్రస్థమున దర్మజుని వైభవము జూడలేక జూదమను మిషఁ గల్పించి మాయాక్షలుపెట్టి ధర్మజునోడించిరి

కర్ణు—అది యెట్లు

శకు—పాండవపక్షమువారిట్లే తమలోపములు లోకము నిందించకుండు నట్లేవో కల్ల లల్లి సమర్ధించుకొనుచుండెదరు

కృష్ణ—శకునీ! నీవు మాయా పాచికలు పన్నలేదా!

శకు—కృష్ణా!

ఉ జూదమునందు పాచికలఁ జూడక వాని తెఱంగెఱుంగకే
జూదకళావిశారదుఁడు శూరుఁడు దర్మసుతుండు జూదమ
ర్యాద నతిక్రమించి యొరులాడిన కాదనలేకపోయెనా?
జూదమునోడి మాపయిన నూయనునిం దలమోపఁ జెల్లునే.

కృష్ణ—మేమేమి నిందలు మోపితిమి? ఈ పాడుజూదమున పాండవులదేవే దిని నన్యాయముగా సిగబట్టి యీడ్చి వివస్త్రను గావింపఁ జూచినారే యిదియేనా రాచ మర్యాద అన్నా! యెంత యసం

గతమైన సంగతికై మీరు సాహసించినారు ఈ కళంకము ఈ మహా పాతకము ఈ మాయ మాయని యీ మత్స్య యెన్ని యుగములు ఎన్ని యుగాంతరములకైనఁ బోఁబోదుగదా!

తే గీ చంద్రబింబంబులో నల్పు జారవచ్చు
నుదధిలో జలచరములు నుడుగవచ్చు
గ్రహగతులు మాఱవచ్చునుగాని మీరు
పాండవులకుఁజేసిన పరాభవము పోదు

దుర్యో—నందనందనా! నీ బెదరింపులకు మేము జంకువారముగాము ఎప్పటికైన లోకము సత్యమును ధర్మమును గ్రహింపకపోదు మేము ద్రౌపదిని గెలిచినాము

కృష్ణ—గెలిచిరే యనుకొనుఁడు మానభంగము చేయవచ్చునా?

దుర్యో—మేము క్రొత్తగఁ జేయలేదు అర్జునుఁడు మత్స్యయంత్రమును గొట్టి ద్రౌపదినిఁ దెచ్చిననాఁడే ఆమె నాయైదుగురు మానభంగము గావించినారు

కర్ణు—మేమంత పని చేయలేదు

ఉ భిక్షను దెచ్చినామనుచు పేరిడి ద్రోవదిఁ దెచ్చి యాసరో
జాక్షను నేవురుంచుకొని యూమెను రాణినిజేసి రిట్లు ద
ర్మక్షయమున్ బొనర్చ నది మాన్పుటకై సభకీడ్చినార మా
దీక్షను ద్రౌపదిన్ విగత దీనదయామతి దుర్గుణావతిన్

కృష్ణ—(చెవులు మూసికొని) పాపము శమించునుగాక ద్రౌపదిని దుర్గుణావతి యనఁ జెల్లునా? అయ్యో మీరెంతకైన సాహసించుచున్నారు

దుర్యో—లేదు. నీవు యెఱింగియు ముసుఁగు పెట్టుచున్నాఁడవు

తే గీ అయిదుగురు పతులుండఁగా నాఱవపతి
వలయున్నదియే పతివ్రతయటన్న
దరణి సత్యపతివ్రతాత్వమున కింక
చోటు లేదనవలయు ననూయగాదు

కృష్ణ—అదియొక చెడుసంగతిగా గ్రహించుట పాడిగాదు

కర్ణు —కృష్ణా! పాండవులచేతను తత్పత్నిచేతను ఇట్లెన్నిబొంకులు బొంకించెదవు

కృష్ణ—పాండవు లెప్పుడును బొంకులాడి యెఱుంగరు వారు లోకోత్తర దర్మపరాయణులు గుణసంపద్విశేషశేముషీదురీణులు సత్యసంధులు

దుర్యో—కృష్ణా! చాలు నిఁక నూరకొనుము వారి సత్యసంధత యెవరికిఁ తెలియదు

ఉ బొంకుటగాదొ మత్స్యపతిపొంతకుఁబోయి విహీనవృత్తి నే
కంకుఁడనంచు ధర్మజుని గాదిలిచుట్టమనంచు చెప్పుటల్
బొంకుటగాదొ ద్రౌపదిని బొందిననాఁడు, పరాంగనోర్తు దా
నుంకువఁజేయునాఁ డిఁకను నున్నవి బొంకులు రంకు లెన్నియో.

కృష్ణ—దుర్యోధనా! యేటికీ యనగత్యప్రసంగములు మీ సంగతి పాండవుల సంగతియు నే నెఱుంగనిది గాదు. మీ కాపదవచ్చినప్పుడు వారు బొంకలేదు పాఱిపోలేదు

శా గందర్వుల్ మిము గట్టిపెట్టి విలయాగారంబు గొంపోవ నా
గంధర్వాధమకోటిద్రుంచియు మిమున్ గాపాడిరాపాండవుల్
బంధుత్వంబునఁదొట్టిమీకరయ విశ్వాసంబు లేదింత గ
ర్వాంధత్వంబున మాటలాడెదరు న్యాయంబయ్య యీమార్గముల్.

దుర్యో—మేమును నిట్టిమహోపకారము లనేకములు గావించినారము

కృష్ణ— కావచ్చును. మీరు కలిసియుండుటలోఁ బ్రజాక్షేమమున్నది.

దుర్యో—కృష్ణా ! నీ వెఱుంగవు

చం ప్రజలకు మాకు నేవిధవివాదములేదు విరోధ మీ ఖల
వ్రజమె , వ్రజాంగనాదవ భవత్పరికల్పితమాయగాని యీ
కుజనులు పాండుపుత్రకులకున్ దరపంచి సగంబు నియ్యఁగా
నిజముగ దాయలే తెలిసి నిందలు మాపయి మోపఁ బాడియే

కృష్ణ—పాండవులు మీకుఁ జుట్టములేకారా ?
దుర్యో—కారు
కృష్ణ—కారు కాఁబట్టియే మీరు—

ఆ లక్కయింటఁబెట్టి యొక్కమాఱేవురఁ
బట్టి చంపఁ జిచ్చుఁ బెట్టినారు
కలుషభీతిలేక కౌరవాన్వయవార్ధి
బాడబాగ్నులనఁగఁ బరగినారు

దుర్యో—కృష్ణా ! యివి యెక్కడనేర్చినావు నిరపరాధులమైన మాపై యేల నిందలు మోపెదవు.
కృష్ణ—నిందలుగావు మీరొనరించిన పాపములు
దుర్యో—మేమేమియు పాపములు సేయలేదు
కర్ణు—కృష్ణా ! నీవంతమాట అనఁజెల్లదు
కృష్ణ—నన్ను మీ రవమానించుచున్నారు.
దుశ్శా—ఇదే యవమానమా !
కర్ణు—అగునెడల నీవీ రాయబారమునకే రావు పాండవమధ్యముఁడు నీకేమి చేసెనో మఱచిపోయినావు

ఉ వంచనఁజేసి మీకులము పాడొనరింప కుయోగియై వనిన్
బొంచి సుభద్రనెత్తికొనిపోయిన పార్థుశిరంబు రెండు గా
వించక వానినే వెనుకవేసుకవచ్చితి(వి)

దుర్యో— ఇంక వారి

వర్జింపుము చక్రి ! మాకురుకిరీటము నిత్తుము రమ్ము మాదెసన్

కృష్ణ—ఇట్టి పేరాసలకుఁ బోకుఁడు
శకుని—అటులైన నీవిందుండి కదలిపోరాదు
కృష్ణ—ఏమి నన్ను బంధించెదరా ?
దుర్యో—అగును

కృష్ణ— చక్రముదీసి) నిలువుము

ఉ నీవును రావణుంతు కడునేర్చినమూర్ఖులు మున్ను రామునిన్
రావణుఁడోజమైయెఱిఁగి రాలె రణంబున నీవుగూడ నా
లావును పాండవోత్తముల లావును లెస్సయెఱింగి పోరఁగా
నీవిధి కాలుదువ్వెదవిసీ కులనాశము తెచ్చిపెట్టఁగన్

భీష్మ—ఇంక నీసభలో నన్మదాదు లుండవలసినదిగాదు నేను లేచిపోయెదను
(అని వెళ్లును )

విదు—వీరికి వీరావేశములు బయలుదేరినవి ముందేమిజరుగునో తెలియదు
కాని నేనీ శ్రీకృష్ణునిబాసటయై నిలిచెదను
(సభ్యులు చెదరిపోవుదురు )

ధృత—(లేచి తడుముకొనుచు) అయ్యో ! శ్రీకృష్ణనంతటివానిని బందించుట
యేనా ? యింక మనకుఁ బట్టగతులుండునా ! నాయనా ! యీ పని
మాత్రముసేయకుము మా కురున్నపాలకులిట్టి దురంతము లెప్పుడును
చేయ సమకట్టలేదు ఇది లోక విడ్డూరము ఘోరము ప్రళయము.
వలదు నామాట వినుఁడు నిష్కారణము చెడిపోదురుసుమా ?

విదు—ఈచతుర్దశభువన బ్రహ్మాండము లెవని యుదరకుహరంబున నొదిగి
యున్నవో యెవనియిచ్ఛామాత్రమునఁ గాలత్రయంబును జగత్ప్ర
కృతియు చేతనాచేతనంబులైన సమస్తజీవరాశులును రేయం
బగల్లును గతితప్పక సంచరించుచున్నవో అట్టి శ్రీమన్నారాయణువాది

దేవుని వీరు బంధింపనెంచినారు వీరికిఁక పోఁగాలము దాపురించినది నే నిందుండి లేనిపోయెదను (అని వెడలును.)

దుర్యో—వీరందఱు పాండవపక్షపాతులు

శకుని—అగును

కృష్ణ—నన్నిందుండి పోనియ్యరా ?

శకుని—నిన్ను విడిచినచో మాకు హానిసంఘటించును

దుర్యో—దుశ్శాసనా ! చూచెదవేమి ?

దుశ్శా—ఇవిగో శృంఖలములు బంధించుటకు సర్వసిద్ధముగనున్నాఁడను

కృష్ణ—(లేచి) ఏమి ! మీయవజ్ఞత ! నన్నా ! మీరుబంధించున్నది ఇది బాలబిభీషికలుగావు దురాత్ములారా !

శా మీరేకాదు సురాసురాళి యొకటై మిన్నెత్తుగావచ్చినన్
జేరంజాలరు పట్టనేరరు కటా ! చిత్రంబు కాలాగ్ని కీ
లారాశిన్ జెదవట్టునే నభము లీలన్ మ్రింగు నజ్ఞానులు
న్నారా ! పొండు సుయోధనా శకుని కర్ణా క్రూరదుశ్శాసనా !
(అని లేచిపోవును )

కౌరవులు—(నివ్వెరపడిచూచుచు) ఆహా ! యేమి యీ విశ్వరూపము

దుర్యో—

చ అవె పదునాల్గులోకములు నయ్యవె స్వర్గపురాలు దేవతా
భవనము లయ్యవే దివియు స్వర్ధుని యావినువీధి తారకల్
సవిత శశాంకుఁ డియ్యదె రసాతలమయ్యదె రాక్షసాలయం
బవని చరాచరంబిది మహామహితంబగు విశ్వరూపమున్

(అనిలేచి) ఇది కృష్ణునిమాయ. మన యెదుట నింద్రజాలమువన్ని తప్పించుకొని పోయినాఁడు.

ఇది ప్రథమాంకము.

# మహాభారతకౌరవరంగము

## ద్వితీయాంకము



రంగము — యమునాతీర విదురకుటీరము

(విదురుడు, శ్రీకృష్ణుఁడు ప్రవేశించియుందురు)

కృష్ణ—మామా! విదురా! నీ కుటీర మీ యమునాతీరమున నెంతసొంపు సంపాదించుచున్నది

విదు—నందనందనా! త్రిలోకపావనమైన నీ పదరజోవేశమున నా యిల్లు నా ప్రాంగణము నిజముగానిలింప పూజితమైన సొంపుసంపాదించినది. గడియక్రితము నిరలంకృతమును నిస్సారమునునైన నాయీ యింటికేమి శోభయున్నది ?

కృష్ణ— ఆహా!

ఉ. చుట్టు వనంబుపూచి కడు సొంపులు నింపు శకుంతలంబులే
పట్టున గానమున్ సలుపు పాఱెడు నీయమునాతటంబునన్
గట్టిన యీ కుటీరము సుఖంబులకున్ నెలవై శుభంబు చూ
పట్టెడుగంటె నిన్నరయ వచ్చినవారికి స్వాగతంబుగన్

విదు—వసుదేవకుమారా! యీ కుటీరాభివర్ణనమునకేమి వచ్చెను. నిన్న కౌరవ సభాంతరమున జరిగిన పరాభవదవాగ్ని చల్లారు టెట్లో యోచింపుము.

కృష్ణ— మామా! భయపడెదవేటికి ? ఆ కార్యము నాచేతిలో నున్నది ఒక్క త్రుటికాలములో నీ యాకాశమును ఈ చరాచర విశ్వమానవ ప్రపంచమును పంచభూతములతోఁగూడిన యీసృష్టి తలక్రిందు

లుగాఁ జేసివేయుదును శాంతిపుము కౌరవుల కావర మణఁచివేయు
కాలము సమీపించినది.

విదు—సత్యము సత్యము

ఉ నీవు మహానుభావుఁడవు నీవు నెఱుంగనియట్టి యర్థముల్
లేవు సమస్తశక్తులు చలించెడు నన్నిటియందు నీవ యు
న్నావు సుయోధనాది కురువీరు లెఱుంగక గేలిచేసి నా
రీవిధి విడ్డురంబు విన మెన్నడు గొఱ్ఱెలు కొండదాఁకుటల్

కృష్ణ—మామా! కృతత్రేతాయుగంబులఁగూడ నిట్టివార లుదయింపకపోలేదు
దుష్టులునుతత్సంహారమునుయనావిదిగజరుచునేయున్నది

విదు—ఆహా! ఎంతవిరుద్ధ మెంత విరుద్ధము

ఉ దూతగవచ్చినట్టి హితదూరునిసైతము వేట్కఁ బంపుటే
నీతి, మహానుభావుఁడగు నీవరుదెంచినఁ బూజసేయకీ
రీతి పరాభవింతురె యరెంబలె నీకురువంశ మీయప
ఖ్యాతి నశించిపోవునిఁక కాఁగలదానికి చింతయేటికిఁ

(తెరలో)

చ అణువులయందు సుందరయజాండమునందు హిమాంబు సూక్ష్మపుం
గణములయందు సూర్య శశికాంతులయందు పరాత్పరా! భవ
ద్వినుత విలాసవై ఖరి ప్రవీణతఁ దోఁచుచునున్నదింక నిన్
గనుగొనలేనిబో కనులు గల్గిన నంధులుగారె మానవుల్

విదు—కృష్ణా! అదిగో నారదుఁడు వచ్చుచున్నట్లుంది

కృష్ణ—రానిమ్ము

నార—(పై పద్యమును జదువుచు ప్రవేశించును) కృష్ణా! వాసుదేవా! కౌరవ
సభలో నీకు జరిగిన పరాభవము దేవేంద్రునకుఁ దెలిసి నీదర్శనార్థమై
వచ్చుచున్నాఁడు

కృష్ణ—మహాభాగ్యము

నార—

సీ. విధిని నిర్బంధించి వేదంబులనుగొని
 సోమకాసురుఁ డబ్ధిఁ జొచ్చునాఁడు
దివిజులు దనుజు లబ్ధిని ద్రచ్చునప్పుడు
 కాలకూటము భూమి గాల్చునాఁడు
ఖలుఁ డాగతాయి రక్కసి హిరణ్యాక్షుఁ డీ
 యవని చాఁపగఁజుట్ట నరుగునాఁడు
సత్యపతివ్రతా సమితిని సీత ను
 పౌలస్త్యుఁడు హరించి పాఱునాఁడు

గీ. ఎట్టికడగండ్లు ప్రజ లవు డీడ్చినారొ
తిరిగి యా యగచాటులే తెచ్చినారు
కుడిచి కూర్చుండ కీకురు పుడమి పతులు
పై పయిని పోవ దీ పరాభవ దవాగ్ని

దేవా ! ఎదునందనా ! నేను పోయెదను. అదిగో దేవేంద్రుడు వచ్చు చున్నాఁడు (అని నిష్క్రమించును)

దేవేంద్రుఁడు—(ప్రవేశించును) జయము జయము కృష్ణా !

కృష్ణా—(విదురుఁడు ఎదురుగావెళ్లి) స్వర్గాధిపతియగు దేవేంద్రుని రాకమాకు శుభమగునుగాక పురందరా ! ఈయాసనమున నధిష్టింపుము

దేవేం—మహాభాగ్యము (అని కూర్చుండును)

విదురుఁడు—(వనమునుండి వచ్చిన గోవులు పాలుపితికి యింద్రునకు నర్ఘ్య మిచ్చును)

ఇంద్రు—(సంతుష్టుఁడై విదురునకు వందనముజేసి) మురానేక దుష్టరాక్షస విదారీ కంసారీ ! నీవు రాయబారిగా వెడలినప్పుడు కౌరవ

సభను నడచిన యుదంతమంతయు నారదునివలన తెలిసికొని మిక్కిలి విషాదపడినారము మా మేనులు పులకించినవి సకలలోక పూజ్యుఁడవైన నిన్నట్లా కౌరవహతకు లవమానపరచుట మిక్కిలి సంతాపకరము

సీ రాజసూయమునాఁడు రగిలిన శిశుపాలు
మస్తకంబును దునుమాడునాఁడు
దురములోపల సురాసురలు జూచుచునుండ
నరకాసురునిబట్టి నరుకునాఁడు
బాలకేళీలీల కాళిందిశిరములఁ
దునియలుగాఁ గాళ్లఁ ద్రొక్కునాఁడు
స్వకులస్వరాజ్యవిధ్వంసుని కంసుని
సిగఁబట్టి వంచి నిర్జించునాఁడు

గీ నీ మహాత్వంబు లోకంబు నివ్వెరపడి
చూచి తలవంచి పూజించుచుండ నెంత
తెంపరై సుయోధనుఁడు నిన్నొంపఁ జూచె
నకట యాతనిపోఁగాల మరుగుదెంచె

(ఆకాశముపై దేవతలు "నిజము నిజము" అని భేరీనినాదములు సేయుదురు పుష్పవృష్టి కురియును )

విదు—దేవేంద్రాది దిక్పతులారా! మీానుడువు లమోఘములు.

ఇంద్రు—ఓ కృష్ణా! ఆగతానాగతావేదివైన నీకు తెలియనియర్థములేదు నీవు సర్వజ్ఞుఁడవు సర్వశక్తి సంపన్నుఁడవు కాలత్రయము నీ చేతిలోనున్నది నేను నిన్నొకవర మడుగవచ్చితిని అవహితుఁడవై విని ప్రసాదింపవేఁడుచున్నాఁడను

కృష్ణు | దేవేంద్రా! నీ కేదివలసిన నది భవత్ప్రీత్యర్థ మిచ్చుటకు సంసిద్ధుఁడి

నై యున్నాను అడుగుము సంశయములేదు

ఇంద్రు—

ఉ అడవులఁ జేర్చుమార్చి వ్యసనాహతి చేట్పడి కుందుచున్న నా
కొడుకును నీమరంది యదుకుంజర పార్థున కీవు ప్రేమ తో
డ్పడిన నిజంబుగా రిపుల భారత యుద్ధమునందు గెల్చి యీ
పుడమి యశంబు వైభవము బొందగలారు జగంబు మెచ్చఁగన్

కావున నో యదునందనా ! నీవు ప్రసన్నుఁడవై ధనుష్కళా విశారదుఁ
డైన నర్జునునకుఁ దోడ్పడుదునని నాకు వర మొసంగుము మీరిరువురు
కలిసి నిలిచిరేని భారతమహాయుద్ధము నవలీలగ జయింపఁగలరు మీకు
మేము బాసటయై యుందుమని మేమీ పంచభూతములమధ్య ప్రమాణము
చేయుచున్నాను

కృష్ణు—నీ యాదేశానుసారము నాకు మిక్కిలి వత్సలుఁడైన నర్జునునకు నేను
తప్పక తోడ్పడియెదను నీవు మాకొక సహాయము సేయవలయును

ఇంద్రు—అది యేమి ?

కృష్ణు—కర్ణుని కవచకుండలములు ఎటులైన మాయఁజేసి హరింపవలయును,
లేకున్న నాతఁడ జేయుఁడు

ఇంద్రు—ఆ యుపాయముగూడ నీవే చెప్పుము

కృష్ణు—నీవు భూసుర వేషమునఁబోయి యాచించిన నాతఁడు కాదనకిచ్చివేయును.

ఇంద్రు—అట్లగునుగాక (అని అందరు నిష్క్రమింతురు)

ద్వితీయరంగము

(పాండవులు ద్రౌపదీసహితులై ప్రవేశింతురు)

ధర్మ—శ్రీకృష్ణ భగవానుఁడు దుర్యోధనాదులపాలికిఁ బోయి మాకై

మేలు గడించికొని వచ్చెదనని బాసాడివెడలి యేలకో యింకను రాలేదు. ఆదురాత్ములు హితవచనంబులు వినువారు కారు నందనందను కేమైన కీడులాలోచించిరోమోయని నాహృదయము తల్లడిల్లిపోవుచున్నది నేను దేనికై వగఁ జెందఁగలుగుదును !

ఉ. పుట్టిన యూరిలో నిలువఁబోలదు పొమ్మనఁ బోయియొండుచోఁ
గట్టిన యూరు సొచ్చి యిది కాదని జూదమువెట్టి గెల్చి మా
పట్టున నిల్వనీడయును పండఁగఁ బంచయు నీక కానలం
గొట్టె సుయోధనుం డలిగి కొంటెతనంబున మేము గీడ్పడన్

భీము—అన్నా ధర్మరాజా ! నీవీసంగతి ముందే యెఱింగియున్న మనకీకీడే రాకపోయెడిది

మ. జగడం బాడఁగలేదు కౌరవుల పచ్చన్‌జూచి దుఃఖించలే
దగుణంబుల్ వచియింపలే డకట మాయాద్యూతమున్‌బెట్టియిం
తగతిన్‌దెచ్చె సుయోధనుండు ఖలుఁడై తద్రక్తమున్‌ద్రావి నా
దగ చల్లార్చెద నొక్కనాఁడు కురుకాంతారంబు ఖండించుచున్

అట్టి మేటి కాలమాసన్నమగునుగాక దుష్టులు ప్రపంచనాటకరంగము నుండి నిష్క్రమించెదరుగాత ఈపంచభూతములు ఆవిధి ఆసూర్య చంద్రాది దిక్పతులు నాకుఁ దోడై నిలిచెదరుగాక

అర్జు—అన్నా ! నాఁటి పరాభవ మెంత మఱచిపోవుద మన్నను మఱపురాకున్నది

ఉ. పుట్టిననాఁటగోలెమము మొత్తి కృతాంతనిశాంతవీథికిన్
నెట్టఁదలంచి సాగక వినిందిత వృత్తి సుయోధనుండు మా
పట్టు కదల్చి మావసతిబాయఁగ ద్రౌపదినీడ్చి కొల్వులోఁ
బెట్టి వివస్త్రఁజేసె నిది వీరులమార్గమె లోకమాడదే

నకు—ఆదుర్యోధన హతకుని లోకము నిందించిన నేమి, నవ్విననేమి

వాఁడు చేయవలసినంత పరాభవము చేయనే చేసినాఁడు

ఉ తీరని దుఃఖసంతతులఁ బెంపి బరంపడి కట్టుకొన్న నా
గారమునుండి లేపి మము కానల ద్వాదశవర్షముల్ పురిన్
బేరులుమార్చి వత్సరము వేదనలన్ బడుమంచు బంపె నా
క్రూర సుయోధనుండిపుడు కూర్చునొలేదొ సగంబురాజ్యమున్

సహ—అది యెవరు చెప్పఁగలరు?

వ పుడమియు రాజ్యమున్ బయిసిపోవఁగ గోత్రులు త్రవ్వియూరిలో
వెడలిచి పట్టెడన్నమును వెట్టక పొంగల సాగనంపుకై
వడి మము నెట్టె కానలకు బాతలుగామొ సగంబురాజ్య మా
కిడదగమో రణంబునకు నీశ్చిన గెల్వమొ కౌరవేయులన్

ధర్మ—

మ పదమూఁడేండ్లు భరింపరాని వెతలన్ ప్రాణాలుక్షోభించ నా
పదలన్ బొర్లుచు నెన్నఁడైన హితముల్ ప్రాపింపనాయంమనె
మ్మదిలో పుట్టెడు నాస వెట్టుకొని ప్రేమన్ గాలమున్ బుచ్చుచు
న్నది యీద్రౌపది దీనిమెట్లు తుదకన్నా తీఱునో తీఱదో
ఓపాంచాలీ యాజ్ఞసేనీ! యేల నీవీతల ముడివేయవు?

ద్రౌపది—ఎట్లు వేయఁగలను

చ జడముడి వీడ ముంగురులు జార వివస్త్రనుజేయఁ దెచ్చిన
ప్పుడు సభలోన నేను ఇది పోలదు మీకని చెప్ప దుస్ససే
నుఁడు వినకున్న నీకడ పునున్ బెగలించి త్వదీయ రక్తమే
ర్పడఁగ బిరాన నాకురుల రాచి ముడించెదనంచు నాడితీన్
ఆశపథ మెట్లు వదలుకొందును

భీము—వలదు నీవు వీడవలదు ఆదుశ్శాసనహతకు నట్లే కావించెద నోపికఁబట్టుము.

ద్రౌపది—నేనట్టి వేడుకఁ జూడఁగలనా ? నావేణిని ముడివైచుభాగ్యమబ్బునా ?

భీము—చెలీ ! ఆటులేల శంకించెదవు ?

చ ఆబలను నస్వతంత్రను పరాంగన నొండొరు లంటరాని నీ
కబరినిబట్టి యీడ్చి రిది గంబరసేయఁగఁ గట్టుచీరలన్
గబగబ వచ్చి విప్పి రల కౌరవపాంసులు భూతకోటికిన్
గబళంములైననాఁడె ముడిగట్టుము నెత్తుటముంచి నీకురుల్

అర్జు—అగుఁగాక

ఉ కాలముతప్పివచ్చినది కానలకీడ్వడి పేర్లుమార్చి దుః
ఖాలకు నాలవాలమయి కష్టములెన్నొ సహించినాము మా
పాలి కనుగ్రహింప భగవంతుఁడు లేఁడె కృతాపరాధులన్
గూలిచి మాకు వేట్క లొనఁగూర్పడె నమ్మినవారివీడునే

ధర్మ—దుర్యోధనాదులచే పరాభూతుఁడైన విదురుఁ డీ సమీపాశ్రమమున నున్నాఁడు వానిదర్శింపఁబోవుదము రండు (అని వెడలుదురు కృష్ణుఁడును, విదురుఁడును సమీపింతురు.)

ధర్మ—(తక్కినవారును నమస్కరింతురు )

శా దేవా ! నీవు మహానుభావుఁడవు నర్థిన్ నిన్ను దర్శించి యెం
తే విశ్వంబు తరించు సర్వమున నీవే యొప్పియున్నావు మా
దావాగ్ని ప్రతిమానమౌ యిడుమలన్ దప్పించి రక్షింప మా
కీవేతప్ప నితఃపరంబు గలదే కృష్ణా ! జగన్నాయకా !

కృష్ణ—మీకు జయమగునుగాక

ధర్మ—దేవా ! దేవకీనందనా ! నీవు కౌరవులయొద్దకుఁ గొంపోయిన మారాయబార మేమైనది ? సందియేమైనపొసఁగినదా ! మాకేమైన గతిని కల్పించినారా?

కృష్ణ— లేదు

ఉ పాండవదూత యాతఁ డొకపక్షపువాఁడని రాయబార మ
ట్లుండఁగ నన్ను జూచి విరసోక్తుల నాడుచు సాగనంపిరా
దుండగు లైన కౌరవులు ద్రోహులు వారల పొత్తు మీకు ని
ట్లుండఁగఁ గూడునే తుదకు యుద్ధము తప్పదు ధర్మనందనా

భీము—అగుఁగాక కృష్ణా! మంచిపని చేసితివి నేటికి నామనోరథము పలించినది ఆహా! నీవు విశ్వజ్ఞుఁడవు, సకలకల్యాణగుణాకరుఁడవు కావున నాచేతుల తీటతీరుటకు సమయము గల్పించితివి రణముకావలెను కౌరవుల కావర మణఁగవలెను మాకు స్వరాజ్యమురావలయును ఇదే నాకున్నకోరిక

ధర్మ—కృష్ణా! తుదకు యుద్ధమే సిద్ధమా! అయ్యో! యెంత కెంతమూఁడినది ఇంక నే నేమి చేయను?

అర్జు—బావా! సంధి పొసఁగలేదా?

కృష్ణ—లేదు

విదు—

ఆ గీ కృష్ణుఁ డంతవాఁడె యేగి సందినిసేయ
లేకపోయె నన్నలోకమందు
ఏదిసంది జరుగు నెవరుసేయగలారు
ఉభయులకును హానియున్నగాని

కృష్ణ—సందికై మిక్కిలి ప్రయత్నించితిని కాని కార్యము లేకపోయినది విధి విదాన మనుల్లంఘ్యము అప్రతిహతము

భీము—ఏమీ! కృష్ణా! నేనీసంధిప్రయత్నము వలదని చెప్పలేదా!

కృష్ణ—శాంతిసహితమైన సఖ్యము సర్వశ్రేయము! రణము మారణము

భీము—దుర్జనమారణము దుర్నివారణము.

మ. రణమన్నన్ భయమందుచుంటిమని కౌరవ్యావమ శ్రేణితో
వినయంబారఁగ సందికై చెనఁగితో విన్నార నీమాట దు
ర్జను లాలింతురె వారినెల్ల నసిదారన్ ద్రుంచి నిర్ధూమహా
మ నిరాలంబముజేసి లోకమునకుం మార్గంబుఁ జూపన్ దగున్

నకు—ఈభరతవంశమహాసంగ్రామము భారతభూమిని మహాభారతమైభాసిల్లవలసి యున్నది

సహ—అవశ్యమీకౌరవాదములు మాక్రూరకృపాణ మహాదండహవ్యాదావాగ్నికి మిడుతలవలె మాడి బూడిదకావలసినదే

ద్రౌపది—కృష్ణా! ఆపద్బాంధవా! మాకష్టము లెప్పటికైనఁ దీరునా! మేమీ విపత్సముద్రమునుండి తరింపఁగలమా! మాకేదిశరణ్యము

తే గీ మురళిచేఁ జిగిర్చెను నెండుమ్రోళ్లు కాని
నీదు మురళి విగుర్పఁగా నేరదయ్యె
అతుల జగము నీచే దన్యమై వెలార్చు
చున్న మేము ధన్యులము కాకుంటి మభవ

కావున లోకములో మేమిద్దరమే దురదృష్టవంతులము

ధర్మ—

మ గురుభీష్మాది కురుప్రకాండముల సత్ కోదండపాండిత్య బం
ధురులన్ శౌర్యపరంపరుల్ బుధుల్ యోధుల్ వారెల్లంగనే
పురకున్ సాధ్యమె పాకు నీదుబలమే ముఖ్యంబు మమ్మోము మే
తెలవో మాపి సముద్ధరింపు మిఁక నీదే కృష్ణ! మా భారమున్

కృష్ణు—(నవ్వి) మీకా బెంగవలదు

ఉ లీలసిఖండిభీష్ము నవలీలగురున్ ద్రుపదాత్మజుండు వా
చాలతచేత కర్ణు నలశల్యుఁడు నూర్గురుధార్తరాష్ట్రులన్
కాలునిలీల భీముఁ డరికాండముతో రణవీధి కూల్తు రా
కాలము చాపరించినది కావున ధర్మజ దుఃఖమేటికిన్

దర్మ—కృష్ణా ! నీ సంగతియు అర్జునుని సంగతియు చెప్పవైతివి

కృష్ణు—నీకా సంశయము వలదు

ఉ ఏను కిరీటస్యందనము నెక్కి రణావని మోదవేరసే
నానుల గాల్చుచున్ రిపువనంబుల గాల్చుచు సూత్రదారివం
దాన సమస్త సూత్రరణతంత్రములన్ నడిపించుచుందు మీ
మానవలోకమున్ విమతమండలి నిర్వైరగంది చూడగన్

దర్మ—ఇంక మేము దన్యులము కాగలము

కృష్ణు—ఈలోగ నీవొకపని సేయవలెను శల్యుడు మనపక్షమున రాకున్నను వారివైపేయుండి మనపక్షము పనిసేయునట్లొడంబరచుము (విదురునితో) మామా ! మనము కర్ణునిపాలికిబోయి వానిని తిరుగదీయవలయును ఇది ముఖ్యమైనకార్యము

విదు—నిజము

కృష్ణు—మఱియు.

మ భగదత్తుండు ఘటోత్కచుండు విరటుల్ పాంచాలమద్రేశ లా
తెగకున్ బోని ప్రజాప్రపంచమును ముందే వర్తమానించి యీ
జగడంబున్ నడిపింపగావలయు భీష్మ ద్రోణ కర్ణాదులున్
బగసాదింపగ వత్తురా రిపునిడిన్ బందింప కర్జం బగున్

(తెరపడును )

తృతీయరంగము

(అంగదేశములో కర్ణునిదుర్గము )

(శ్రుతశాస్త్రి కృతశర్మ మున్నగు బ్రాహ్మణులు ప్రవేశించియుందురు )

(తెరలో)

ఇంద్రు—"నవో నవో భవతిజాయమాన" (అని చదువును ) (అది బ్రాహ్మణులు స్వరయుక్తముగా జదువుదురు )

(తెరలో)

ఒరే కుంక! స్వరము తప్పినదిరా

శృత—స్వరము తప్పితే బావే

కృత—అది నీవే

శృత—స్వరము బ్రహ్మకు రాకపోగా విష్ణ్వీశ్వరుఁడు సుశిక్షితుని గావించినాఁడు
స్వరము వేదమునకు ప్రాణము

కృత—ఎన్నిపనసలైన పీల్చి పిప్పి చేయుదునుగాని నాకాస్వరము రాదండి

శృత—ఏమిటి! పనసలు పీల్చి పిప్పిచేయుదువా! ఎంతసేపు ఏడ్చినాతిండికేగదా!

కృత—ఏడ్చినావు నోరుమూయి

శృత—నాతో నీవేడ్చుట కైన పనికిరావు

కృత—అగునది నిజమే

శృత—నీకిఁక చదువేమిటిరా! నీవు తిండికి తిమ్మరాజువు, చదువునకుపోతురాజువు

కృత—చదువు నాకుఁగాక నీకా? ఒట్టివిధవచదువు చదివితే లాభములేదు తెలివి
యుండాలి

శృత—ఏది జట, ఘన చెప్పుము

కృత—జటవేయుటకు ముందు నీజుట్టు పాయలు దీయవలయును తరువాత ఘన,
అమన వాయించి చెప్పెదను

శృత—నీతెలివి మండినట్లేయున్నది

కృత—దీపము మండితేనేగాని కాంతి ప్రజ్వరిల్లదు అట్లే తెలివి మండితేనేగాని
తేజము బయలుపడదు ఒట్టిపరమశుంఠవు, నీకేమితెలియును? ఏది
యొకపాట హాయిగ పాడుము చూచెదను

శృత—సంతచెప్పుకొనేవానికి పాట యేమిటిరా!

కృత—ఆసంతపాటే పాడుమన్నది

శ్రుత—సంతపాటేమిటిరా ! పీనుఁగా వేపముపల్లె వేయుటకు సంత చెప్పుకొనుట యని యందురు

కృత—నేనన్నదియు నదే నీ కర్థముగాక మొత్తుకొనుచున్నావు ఏది నీస్వరము చక్కగానుండు ననుచున్నావు, ఏదేని యొకటి పాడి వినిపింపుము

శ్రుత—నాకు నీ పాటలుచేతగావు పాటలుపాడి భిక్షాటనము సేయుదువా ఏమి?

కృత—ఏదైన విద్యయే "కోటివిద్యలెల్ల కూటికొఱకె"
(అని లయవేసి పాడును)

శ్రుత—అదే గురువుగారగు దేవేంద్రభట్టుగారు వచ్చుచున్నారు

ఇంద్రు—(ప్రవేశించి) ఓరి వెధవాయి అదేమిపాటరా !

కృత—పాటకాదండి వీడిమాటకు సమాధానము

ఇంద్రు—

"కేవలం లౌకికం గానం నకుర్యాత్ మోహతోపివ
అథ కుర్యాత్ ప్రమాదేవ ప్రాయశ్చిత్తీకురుద్విజ"

కావున గానము ప్రమాదవశముచేఁ జేసినను బ్రాహ్మణునకుఁ బ్రాయశ్చిత్తము తప్పదు.

శ్రుత—అయ్యా ! వీఁడు సరస్వతీబ్రాహ్మణుఁడు కాబట్టి ప్రాయశ్చిత్తమక్కరలేదు

కృత—(స్వ) సరస్వతీబ్రాహ్మణులు వేపలు తిందురని నన్నీతఁ డధిక్షేపించుచున్నాఁడు సరే నేను దానికి సరియైన సమాధానము చెప్పెదను ఒరే శ్రుతశాస్త్రి ! నన్ను నీవు సరస్వతీబ్రాహ్మణుఁడని గదా అన్నాఁడవు అయ్యా! గురువుగారు! వీఁడు నాకు వంటబ్రాహ్మణుఁడు (శ్రుతశాస్త్రితో) ఒరే నీవన్నదానికి సరిపోయినదా !

ఇంద్రు—బ్రాహ్మణులతో నిన్ని బేదము లెక్కడనున్నవిరా ! "బ్రాహ్మణోస్యముఖ మాసీత్" బ్రాహ్మణులు బ్రహ్మముఖమునందు పుట్టినారు

శ్రుత—వీఁడు సరస్వతీముఖమునందు పుట్టినాఁడు. కావుననే సరస్వతీ బ్రాహ్మణుఁడైనాఁడు.

కృత—వీఁడు అన్నపూర్ణాదేవిచేతిలోఁ బుట్టినాఁడు కావుననే వంట బ్రాహ్మణుఁడైనాఁడు

ఇంద్రు—(స్వ) నేను దేవేంద్రుఁడను అదిగో ! యెవరో బ్రాహ్మణుఁడీ వంకకే వచ్చుచున్నాఁడు వీనివలన కర్ణుని యుదంతమంతయు తెలుసుకొనవలయును మహానుభావుఁడైన శ్రీకృష్ణుఁడు నాప్రియపుత్రుఁ డర్జునునకై కర్ణుని సహజకవచకుండలములు సంపాదింపుమని యానతిచ్చినాఁడు నేనెటులనైన నాతనికోర్కెఁ జెల్లించుటకై యీ బ్రాహ్మణవేషమున నిచ్చటకు వచ్చితిని నాయత్నమున కీశ్వరుఁడు తోడ్పడవలయును

(ఆకాశవాణి) తథాస్తు

వ్యాఘ్రభట్టు—(ప్రవేశించి) ఎవరీబ్రాహ్మణోత్తములు

ఇంద్రు—మీకెవరు కావలయును

వ్యాఘ్ర—ఏయూరయ్యా మీది

ఇంద్రు—మాది అమరావతి

వ్యాఘ్ర—ఎందు బోయెదరు ?

ఇంద్రు—ఇట్లే యేదాతనైన నాశ్రయించాలని బోవుచున్నాము.

వ్యాఘ్ర—మీరేమి పండితులా ఏమి ? ఏదీ మీపాండిత్యము "అణోరణీయాన్ మహతోమహీయాన్ ఏషోణునాత్మ" దీనికర్థము చెప్పుము

ఇంద్రు—ఆ పరమాత్మ అణువునకంటె అణుప్రమాణుఁడున్న.

వ్యాఘ్ర—అది గాదయ్యా దాని యర్థము నీవు చెప్పునది వేదాంతార్థము, మాకిప్పుడు లౌకికర్దము కావలెను

ఇంద్రు—లౌకికార్థ మనఁగా ?

వ్యాఘ్ర—శబ్దార్థము శబ్దములు శబ్దములవలె నుండగనే యాషద్భేదముతో నర్థము సాధింపవలయును ఇదిగో! నేను చెప్పెదను చూడుము సంతర్పణాదిశ్రాద్ధాన్నభోజనసమయములలో 'అణో' వడ్డించేశాల్యన్నములో 'రణీయాన్' ఉద్ధరణితో నెయ్యి 'మహతోమహీయాన్' మహిషపు తలకాయలకంటె పెద్దవైన బూర్లవరకు 'ఏషాణుర' వేసేవాఁడేనురా 'ఆత్మ' తనవాఁడు

కృత—కానివాఁడు

వ్యాఘ్ర—కానీకైనఁ గొఱఁగానివాఁడు

ఇంద్రు—ఈయర్థ మెక్కడ నేర్చికొంటివయ్యా !

వ్యాఘ్ర—ఇట్టి సమయానుకూలమైన మహదర్థములు సాదించువారికే రాజగౌరవమును అనూనాధికమైన పండితబిరుదావళులును జాంబూనదతాంబూలాధి సత్కారములును తఱుచు జరుగుచుండును.

ఇంద్రు—అపండితులకు సన్మాన మేమిటి ?

వ్యాఘ్ర—ఇప్పుడు జరుగుచున్న సన్మానములలో మూఁడువంతులపండితులకే నిజమైన విద్యాసంపత్తిగలవారికి అశనం నాస్తి

ఇంద్రు—ఆహా ! రాజాస్థానముల పండితులకుఁగూడ చోటొసంగునా ?

వ్యాఘ్ర—కుక్కలకు కోళ్లకు కులటలకు చోటు గలుగఁగాలేనిది కుకవులకు కుపండితులకు కుచ్చితులకు లేకపోవునయ్యా? వారికే విశేషావకాశములు విలువైన బహుమానములు

ఇంద్రు—ఇది సరికాదని మంత్రిపురోహితులైన చెప్పరా !

వ్యాఘ్ర—వారలువట్టి వెఛవలండి.

ఇంద్రు—విధవలు స్త్రీలయందుందురుగాని, పురుషులయందెట్లుందురు ?

వ్యాఘ్ర—ఉందురు విదవయనఁగా ధవుడులేనిది అనేకధవులు గలిగినది అది పురుషపరమైనప్పుడు ఒకరాజు పొమ్మన్న మఱియొకరాజునుకొలుచుచు కుక్షి నింపుకొనువారని భావము

కృత—ఈతఁడు మిగుల గట్టివాఁడురోయి

శృత—అగును నీవంటివాఁడే.

కృత—నావంటి బ్రభ్రాజమానముగాఁడు కాసంతఉప్పుపత్రియున్న వాఁడే.

శృత—మీపే రేమండిబాబు

వ్యాఘ్ర—వ్యాఘ్రభట్టంబారు

కృత—మీరే యాస్థానకవిపుంగవులు

వ్యాఘ్ర—నేను దానమునకు దిగంతవిశ్రాంతమహాకీర్తివడిన కర్ణునియాస్థాన వికట కవిపుంగవుఁడను.

కృత—ఆహా ! ఏమి మీయదృష్టము

శృత—(స్వ) కర్ణుయాస్థానమునఁ గవియన్న నదియొక ఘనమైనసంగతిగాదు ఈతఁ డాతనియొద్దకుఁబోయి నేను కవి నని చెప్పుకొని యుండవచ్చును సహజదానశీలుఁడైన యాతఁడు సరే యని యింతభుక్తికి దినభత్తెమో నెలభత్తెమో పడవేయుచున్నాఁడు కాఁబోలును

కృత—మీరక్కడచేయుపని యేమండి భట్టుగారు

శృత—తమ ప్రజ్ఞావిశేష మొకింత చెప్పుదురు ! చెవుల తుప్పయిన వదలిపోవును.

వ్యాఘ్ర—ఇంచుమించు అట్టిదే నేను తఱుచు కోటలోనికిఁ బోయి రెండుమాటలు చెప్పి నాల్గు పాటలు పాడి ఓనాటకమువేయుచు అందు

న్నవా రందఱికి చక్కిలగింతలు పెట్టినసురానినవ్వును రివ్వునగాలికెగిరి వచ్చు సముద్రపు కెరటములవలె రంగురంగున తెప్పించి ప్రక్కలు చెక్క లగునట్లు చేయుచుందును ఇందులో నప్రజ్ఞలద్వితీయముఅనుపమానము

ఇంద్రు——ఆమహారాజు మీకేమైన బహుమానము లిచ్చుచుండునా ?

వ్యాఘ్ర——వాటికి లోటేమియు లేదుగాని దాసదాసీపరివేష్ఠితమైన నాకోటలోని వారందఱు నన్ను చూడఁగనే యేదో మిషపెట్టి చక్కఁగా చాగుణింత నిరంతర పారాయణము చేయుచుందురు

కృత——(శృతశాస్త్రితో) అనఁగా నేమిటిరా !

శృత——చాగుణింత మనఁగా చీవాట్లు, చెప్పులు చీచీలు చెంపకాయలు ఇత్యాదికములు వింటివా !

కృత——సరి

ఇంద్రు——అట్లనా ! నాయనా నీవింత ఘనుఁడవా !

వ్యాఘ్ర——నామనత సహజమైనది కర్ణునకు దానము, కుంభకర్ణునకు నిద్రరాజ్యార్ణ వమేలిన రామచంద్రునకు కోదండపాండిత్యము, అగ్నిలోని యుష్ణత మసిబొగ్గులోని నలుపు ఎట్టిదో అట్టిది మేముబహుళపక్షములోనివారము

శృత——(స్వ) ఈతఁడిక మాటలకు పట్టుకొన్న జువ్విచెట్టు తాటిచెట్టునుపట్టుకొని నట్లే వదలునట్లు తోఁచదు

కృత——అటులైన మీరు విదూషకు లన్నమాట

ఇంద్రు——కవి నని చెప్పినారే !

వ్యాఘ్ర——ఆగును నేను కవిని. కవికి విదూషకునకు చుట్టరికము లేకపోలేదు విదూషకుని పని హాస్యము హాస్యము నవరసములలో నొకటిదాని నేనాశ్రయించితిని కావున విదూషకుఁడను గాయకుఁడను

కూడా కాకపోను నాకీవిశ్వమునం దన్నిచోట్ల స్థలమున్నది నేనొకప్పుడు చీమనై బెల్లమును పట్టుకొనుచుందును వెంటనే గరుత్మంతుడనై యాకసమున కెగిరి పోవుదును నక్షత్రములలోఁ గలిసి ఉల్కాపాతమై నేల పడిపోవుదును. అర్ధరాత్రమునకూయు దివాంధములు నాచుట్టములు కాని నేను మాత్రము కోకిలమును

ఇంద్రు—మీరు బాల ఆత్మస్తోత్రపరాయణులవలె నున్నారే.

వ్యాఘ్ర—ఎవరును స్తోత్రముచేయనివారి కాత్మస్తోత్రము స్వహస్తపాకమువంటిది మిగుల సుకరము సౌలభ్యము

తే గీ కాకములమధ్య గూర్చుఁడి కోకిలంబు
పాడియేగద ఘనకీర్తి పడయుచుండు
ఆకసముపైని మేఘంబు లావరించి
యురిమియేగద ఘనకీర్తి పరఁగుచుండు

నే నట్టివాఁడను.

ఇంద్రు—నే నట్టివాఁడను నిట్టివాఁడ ననుటలో విశేషములేదు త్యాగముచేతను సుగుణ సంపత్తిచేతను మనుజుని యోగ్యత తెలియవలయును.

తే. గీ. దీపములు స్వయం దగ్ధమై దీప్తినొసఁగు
సాంబరాణి కాలుచు సువాసనలు జిమ్ము
పూలుత్రుంపఁగఁబడి మోదమును ఘటించు
ప్రేమ యెద యేర్చి యొరు వలపింపనేర్చు.

బ్రాహ్మణవటుఁడు (ప్రవేశింపను) శ్రాద్ధాన్నభోజనములు సురాపానములు సదసత్పదార్థములవంటి ప్రభాకరభాలు తమ తతర్క వితర్కపాకములలో లెక్కించవలసినవిగాని సామాన్యములుగావు ఒక

పూట శ్రాద్ధాన్నబోజన మొక సంవత్సర మారోగ్యమును చెఱచివైచును సారాసేవన మాయువునకే వేరు పురుగు ఇందులో రెండును మనో హరములైనవేకాని రెండను హానికరములనుటలో నిర్వివాదము అసత్తును త్రోసివత్తు నాశ్రయించునట్లు శాస్త్రకారులు సారాలను నిరసించినను శ్రాద్ధములను నిరసింపలేదు వేదములో అన్నం బ్రహ్మ మని చెప్పి ఆయన్నమే ప్రాణాలు తీయునని "అన్నం ప్రజంత్యభిశం విశంతి" అని చెప్పినాఁడు ఆయవస్థయే నాకు వచ్చినది

ప్రత—ఏమయ్యా అట్లు త్రేన్చుచున్నావు

వ్యాఘ్ర—ఈవేళ కర్ణమహారాజుగారి యింట సంతర్పణము దిట్టముగా తిని త్రేన్చుచున్నాఁడు ఈ తిండిపోతులకు రెండవపని యేమున్నది

బ్రా—ఏమయ్యో వ్యాఘ్రపాద అట్టే పోతుపెంటె అనినావంటే నీ యాబోరు దక్కదుచూడు. నా ముందఱ నీవు వ్యాఘ్రపాదవుగావు శునకపాదవు జాగ్రత్త

వ్యాఘ్ర—(స్వ) ఈ ఆగతాయినుండి మనము తప్పుకొంటేనే బాగుంటుందని తోఁచుచున్నది

ఇంద్ర—అంత యెక్కువ తినకపోయిన నేమాయెను!

బ్రా—ఏమాయెనా! నీకు సంగతి తెలియదు

వ్యాఘ్ర—అగు నది నిజము.

తే. గీ దానకర్ణుని నిజదయాదరము నిట్టి
దట్టి దనఁగ త్రినేత్రున కలవిగాదు
ఒక్క కబళంబు దినుటకు నోపనట్టి
వాఁడు కుంచెడన్నము దిని వచ్చుచుండు.

శ్రుత—బ్రాహ్మణునకు కుంచెడన్నమొక లెక్కా.

వ్యాఘ్ర—మృతసూపములతో మఱికొన్ని కుంపము లగును.
ఇంద్రు—కర్ణునివంటి దాత లింకెవరైన నున్నారా ?
వ్యాఘ్రు—లేరు ముందు పుట్టఁబోరు

సీ. అడుగ వచ్చినవారి కవిలార్థము లొసంగి
యాదరంబున సాగ నంపుచుండు
దూర్వాసుఁ డడుగఁగా దుర్గంబు పడఁద్రోసి
వంటకట్టెలకిచ్చి పంపినాఁడు
అక్షయధన మొక్క భిక్షకునకు నిచ్చి
పంచుకొండని దయఁ బంచినాఁడు
ఎవ్వరే మడిగిన నిచ్చెదనని తన
పట్టణంబున గంట కట్టినాఁడు

తే. గీ దాన కర్ణుండు విజ్ఞాన మనుఁ డుదీర్ణుఁ
డతని త్యాగంబు బలి దధీచ్యాది పూర్వ
దాతలకు మించిపోయె మందరము గిరుల
నన్నిటికి మించి కాంతి వెలార్చినట్లు.

బ్రాహ్మ—ఎవరో చండాలురు వచ్చుచున్నారు నేను పోయెదను. (అని నిష్క్రమించును)

సజాతుఁడు—(ప్రవేశించి) నాకే నిజముగా శాపానుగ్రహ సమర్థతయున్న నీదాతలచేతులు మూతులు వంకరలు వోవునట్లుగా శపించియుండ కుందునా!

తే గీ తోఁక ముందును నావెన్క మేఁకపగిది
పేరునకు ముందు దాతయన్ బిరుదువెట్టి
పిలుచు కర్ణువేఁడఁగ వెంట్రుకల నొసంగె
నిట్టి దాతలు మనభూమి పుట్టినారు

ఇంద్రు—ఏమి నీయుదంతము ?

సుజా—నాయుదంతమా ! ఏమున్నది ! నేను కవిని విదూషకుఁడను పండితుఁడను గాయకుఁడను నానారాజ సందర్శనము చేసి మహాభాగ్యములఁ బడసిన దీశాలిని దానమునకు మహా ఖ్యాతిఁగాంచిన కర్ణమహారాజునుబోయి యాచింపఁగా చటుక్కున నిన్ని వెంట్రుకలు దీసి నాచేతిలోఁ బోసినాఁడు ఇట్టి శరులను నే మనవల యునా ! యని నాలో నేను వగచుచు నాప్రాప్తమును దిట్టుకొనుచు వచ్చుచున్నాఁడను

ధన—(ప్రవేశించి స్వ) అబ్బో అబ్బో ! ఎందఱుబాపన్నలు మూఁగినారు కాకుల వలె కళ్లున్న బుట్లు బుట్లున్న కళ్లు కని అఱచుచు మీన మేషాలు లెక్కించుచు తక్కులాడుచున్నారు ఇట్టి సమయములో మెల్లగా వీరలను బుట్టలోపెట్టి ఆసన్నముగా పొడుగుగా రివటపాయలాగున్న నల్లబాపనోడి యొద్ద నున్న కర్ణుఁడుగారి వెంట్రుకలు సంగ్రహింపవలెను వెంట్రుకకొక వెయ్యి వరాలిచ్చెదమని చాటించుచున్నారు ఆచాటింపు వీరు వినకముందే మనమా వెంట్రుకలు లాగివేయవలెను (ప్ర) ఏమండోయిశాస్త్రులుగారు దండాలు దండాలు

వ్యాఘ్ర—ఓహో ! ధనగుప్తుఁడు వచ్చినాఁడు

ఇంద్రు—శుభంభవతు

సుజా—ఏల వచ్చితివి ?

ధన—నేను వర్తకుఁడను కొనుటయు అమ్ముటయు నాపని కొనువారిచేత అమ్మించెదను, అమ్మువారిచేత కొనిపించెదను, నాశక్తిమీకు తెలియదు

ఇంద్రు—అది యెట్లు కొనువారు కొందురు అమ్మువారు అమ్ముదురు కాని కొనువారు అమ్ముటయు అమ్మువారు కొనుటయు నెట్లు సంఘటించును

ధన—గిరాకి అట్టిది అది మాచేతిలో నున్నది అది పరసువేది అది యెవరు తిరిగిన కాలాగ్నికంటె తీవ్రముగా ప్రజను మాడ్చివేయును

ఇంద్రు—అనగా

ధన—బాబు అది వ్యాపారరహస్యము మేమొకప్పుడు బంగారముపెట్టి వెంట్రుకలు కొందుము ఒక వెంట్రుకకొక బంగారపుకొండ సంపాదించెదము

సుజా—ఏమోయి శేఠీ ! నాయొద్ద వెంట్రుకలున్నవి కొనెదవా !

వ్యాఘ్ర—వెంట్రుకలు లేనివారెవ్వరు

ధన—అవే మాకు కావలెను తప్పక కొనెదను మాచిన్నబ్బికి గొంగళికావలెనని నన్ను వేపుకొని తినుచున్నాడు కాశ్మీరమునుండి తెప్పించిన సేలువ కప్పుకోరాదాయని యెంత చెప్పినను వినకనాకు గొంగళే కావలెనని యేడ్చుచున్నాడు గొంగళియు శాలువయు రోమ మయమేగదా ! యని పరువునకు లోటున్నను సరుకొక్కటే కావున నొక కంబళి నేయించుదుమని బయలుదేరినాను బాబు మీయొద్ద యెన్ని రోమము లున్నవి !

కృత—ఇదిగో వీడి తలనిండా మెడనిండా రోమములే యెన్ని కావలసినను సందేహము లేకుండగ నూడలాగవచ్చును

శృత—వీడును నావంటివాడే

సుజా—మీరందరు వెంట్రుక లిచ్చుదాతలు కాదలంచినారా !

ధన—బాబు నే నవి డబ్బిచ్చియే కొనెదను

సుజా—నాయొద్ద గుప్పెడు వెంట్రుకలున్నవి ఎంతకు కొనెదవు ?

ధన—తులములలెక్క నిచ్చెదరా లెక్కప్రకార మిచ్చెదరా !

సుజా—నీవే యడుగుము

ధన—నాది టోకుబేరము ఇదిగో యీసంచినిండ స్వర్ణదీనారములున్నవి యివి పుచ్చుకొని మీచేతితోని వెంట్రుక లిచ్చివేయుడు.

సుజా—మహాభాగ్యము (అని యిచ్చి సంచి తీసుకొనును )
ధన—చిక్కినదిరా లచ్చి (అని పోఁబోవును)

సుజా—(పిలిచి) ఓచేరీ! ఆవెంట్రుకకలీవరాల విలువచేయవు నీయొద్ద నన్యాయముగా నింతధనము తీసికొనుట యధర్మము గావున నీసంచియు నీవే గొనిపొమ్ము

ధన—ఇంకేమిబాబు తమరు ధర్మప్రభువులు (అని నిష్క్రమించును )

మాతంగుఁడు—(డప్పువాయించును) కర్ణమహారాజుగారి కేశములు కోశాగారమున నొక్కొక్కటి యొక్కొక్క వేయివీవరములకు కొనఁబడును గావున కలవారు వెళ్లి మార్చుకొనవచ్చును

(డప్పు)

వ్యాఘ్ర—చిత్రము చిత్రము ధనగుప్తుఁడు మోసముచేసి పాపము పేదబ్రాహ్మణుని నోట కరక్కాయ కొట్టి పోయినాఁడు

ఇంద్రు—ఈతనికి ప్రాప్తములేదు.

తే గీ. లచ్చి కేశ రూపము దాల్చి వచ్చిపోయె
పోల్పలేక పోయితివింక పొగులనేల
ధరణి దురదృష్టవంతుఁ డెంత మిడికినను
ప్రాప్తమునకంటె నధికంబు బడయఁబోఁడు

సుజా—ఆర్యులారా! నన్నా వైశ్యుఁ డన్యాయముగా మోసగించి పాఱి పోయినాఁడు

శ్రుత—అగును వాని వెంబడించి పట్టుకొని తగిన శాస్తి చేయవలయును

కృత—ప్రస్తుతము మన కిక్కడ నాస్తియైనది సరే పదండి పోవుదము

ఇంద్రు—(స్వ) ఆకర్ణుఁ డెంత మహాదాత యిట్టి మహామహునియొద్ద నాపాసిక సులభముగ పాఱుట కభ్యంతర ముండదు. నేనెంతయు ధన్యుఁడను, (అని అందరు నిష్క్రమింతురు )

---

# మహాభారతకౌరవరంగము

## తృతీయాంకము



రంగము—గంగాతీరము

(శ్రీకృష్ణుఁడు, విదురుఁడు, ప్రవేశించియుందురు)

కృష్ణ—మామా! ఈగంగ యెంత రమణీయముగఁ దోఁచుచున్నది.

విదు—ఇది ఉషస్సమయముగదా!

కృష్ణ—అగును.

సీ  శివజటాజూటంబు నవఘళింపఁగ గజ్జె
  లందెలుమ్రోయ నాట్యంబు సలిపి
హిమవన్నగంబున లింపు సొంపారఁగా
  స్వైరవిహారంబు చక్కఁబెట్టి
వారణావతమునఁ బాదంబు మోపి సై
  కతసీమలను బెరగాటలాడి
దారు కావనమధ్యఁ దపసి కన్యలఁగూడి
  సొమ్ములనొడ్డి నెత్తమ్ములాడి

తే గీ  గొల్ల చేడెలుగొల్వ వ్రేపల్లెనుండి
ఇచట నావేణునాద మాలించు కొఱకు
వచ్చుచున్నది గంగప్రవాహ వేగ
వీచికలదోఁగి యానంద విభవమంద

విదు—కృష్ణా! జీవనాధారమైన నీమెకు వేరుగ బహూకరింపవయునా! నీదర్శనమే
 మహాభాగ్యము

తే గీ మొదట నీపాదకమలమందుదయమంది
శివజటాజూట మెక్కవచ్చినదిగంగ
తిరిగి నీపాదసన్నిధి కరుగుదెంచె
సహజమాకర్షకముగాదె జన్మభూమి

కృష్ణ—అదిగో మన కబురు విని కర్ణుఁడీదారినే వచ్చుచున్నాఁడు

కర్ణుఁడు—(ప్రవేశించి) సంధ్యానుష్ఠానార్ధ మీగంగాతీరంబునకు వచ్చిన నన్ను ఎందుకో కృష్ణుఁడు కబురంపినాఁడు అతఁడును విహారార్థమీ ప్రాంతమున వచ్చియుండనోపును కావునపోయి దర్శించెదను

కృష్ణ—(విదురసహిత మెదురేగి) కర్ణా! ఈ యుచితాసన మలంకరింపుము

కర్ణ—మహాభాగ్యము (అనికూర్చుండును)

కృష్ణ—కర్ణా! నీ కవచకుండలము లేమిచేసితివి ?

కర్ణ—అడుగవచ్చిన ఇంద్రునకు దానము చేసితిని

కృష్ణ—అర్ధవంతుఁడైన ఇంద్రునకు దానమేమిటి అది యపాత్రదానముకాదా ?

కర్ణ—కానిమ్ము అర్ధవంతుఁడైనను అర్ధహీనుఁడైనను యాచించినప్పుడున్న దిచ్చుట కేలసంశయించవలయును ? కావుననే నాకవచ కుండలములిచ్చి వేసితిని.

కృష్ణ—అవి నీ ప్రాణములకంటె ఘనములు కావా ?

కర్ణ—ప్రాణమడిగిను నిచ్చివేయుదును ఇచ్చువాని కధికము నీచమనునవిలేవు

తే గీ వార్ధిరత్నాలు గైకొను వానికిచ్చు
కుజము ఫలములన్నిటికోసి కొనఁగనిచ్చు
సతులు దేహీయటన్న భిక్షము లొసంగు
దాత గడియించి యడుగు పేదలకుఁబెట్టు

విదు—ఇంద్రుఁడు పేదవాఁ డెట్లగును ?

కర్ణు—అన్నము మ్రింగుచుండువాఁడు క్షుదాతురుఁడని చెప్పుట యెట్టో యాచకుఁడు
పేదవాఁడని యనుటయు నట్లే

విదు—ఇంద్రుఁడు తనయాత్మజుఁ డగునర్జుమునకు మేలు సేయఁదలంచి నిన్ను
వంచించినాఁడేగాని వేరుగాదు

కర్ణు—అహా ! యింద్రుఁ డెంతమోసగాఁడు

తే గీ కోడియై గౌతముని పువ్వుఁబోడిఁగూడి
పాడుగాఁ జేసికొన్నాఁడు నాఁడు తనువు
నేఁడు కవచకుండలముల నృతము చెప్పి
తీసికొన్నాఁడు దుష్కీర్తి దిశలు నిండ

కృష్ణు—అవి తిరిగి కావలె ననియెదవా ?

కర్ణు—ఇసీ ! అవి యేహ్యములు కావా ! పాము కుబుసము విడిచినట్లప్పుడే వానిని
నేను పాఱవేసితిని.

కృష్ణు—కర్ణా !

ఉ దాతవు వేదశాస్త్రచయధర్మవినేతవు బ్రహ్మతత్త్వవి
జ్ఞాతవు కామముఖ్యరిపుషట్కవిజేతవు సర్వలోకవి
ఖ్యాతవు నీ యశోంగన దిగంతకరీంద్రశిరంబు లెక్కి కా
లూతగ నృత్యమున్ సలుపుచున్నది నీయ దెభాగ్య మర్కజా !

కర్ణు—ఈచరాచరజీవరాశులన్నియు వర్ణనాతీతుఁడ వైన నీ తరువాతనే గదా !
అస్మదాదుల లెక్కయేమి కృష్ణా ! న న్నిప్పుడు కబురుపంపిన పనియేమి ?

కృష్ణు—నీతో కొన్ని రహస్యములు ముచ్చటించవలెనని తలంచితిమి

కర్ణు—ఆ నిగూఢవిషయము లేమో నిర్వచింపుఁడు

విదు—నిన్ను పాండవులపక్షమునఁ బిలువవలయు ననునది యొకవిషయము.

కర్ణు—అది విషయమే ఎన్నఁటికిని పొసఁగునది గాదు

ఉ. పుట్టము కాకపోయినను జుట్టముకంటెను వేయిరెట్లు నా
పట్టున నాచరింపుచు శుభంబులఁ గూర్చుచు నంగరాజ్యమున్
బట్టముగట్టినట్టి నరపాలు సుయోధనువీడి కుంతికిన్
బుట్టినవారి పక్షమునఁ బోయి కృతఘ్నుఁడనౌటఁ బోలునే

కృష్ణు—కర్ణా! వదాన్యచరితుఁడ వైన నీకు తెలియని యర్థములేదు గాని నీవు దుర్యోధనాదులచే నేమేమో గొప్పగౌరవమునకుఁబాత్రుఁడనైనాఁడవని పలుకుచున్నాఁడవు నీవెవరియొద్ద నున్నను నిట్టి మహనీయమైన పదవి నందవలసినవాఁడవే

విదు—అగును సందేహ మేమున్నది ?

తే గీ శుక్తిగర్భంబులోనున్న మౌక్తికంబు
రాలగనులందుఁ బడసిన రత్నచయము
అగతలంబున దొరకిన హాటకంబు
పృథుకిరీటముల నలంకరింపఁ బడవె

కృష్ణు—కాని, కర్ణా! నీవు నేఁటివఱ కెవరియెడ నఖండమైన కృతజ్ఞత గలవాఁడవై మెలఁగుచు ప్రాణమైన దారవోయ సమకట్టియున్నాఁడవో అట్టి కౌరవులు నీయెడ నిసుమంతయు గౌరవముంచినట్లు తోచఁదు

విదు—అగును

కృష్ణు—

మ గురుభీష్మాదులు నిన్ను క్షుద్రుఁడని సంకోచింపకే చెప్పుచుం
దురు నిన్ యోధునిగాఁ దలంపరు దురుద్యోగంబునన్ నిన్ను న
ర్ధరథున్ జేసిరి పోరునందు శరసంధానంబు మోక్షంబు నే
మఱెదంచున్ శపియించినారు మఱి నీ మర్యాద పాటించిరే.

కర్ణు—కృష్ణా! నీవన్నది నిజము కానివారితో నాకేమిపని నాకై దురాగతములు పన్నినవారిలో నాయేలిక కేమియు ప్రశక్తిలేదు నా జవసత్వము లన్నియు నాప్రభువగుసుయోధనుని గూర్చుటకై యున్నవి గాని నాకంపు స్వార్ధ మావంతయులేదు

ఉ ఏను నదీవిదానఁ బ్రవహింతును నగ్నివిధాన రాతు ఝుం
ఝూనిలమట్టు లోకమున సాగెద భూమివిదాన నుండెదన్
గాని ననున్ మలీమసముగా నొనరించిన, నార్పివేసినన్
మానినఁ ద్రవ్విపోసిన వినాశముగాను నిజంబు కేశవా!

కావున ఓ నందనందనా! ఎవరో యేమో నన్ను తిట్టినారని నిరసించి నారని శపించినారని యెన్నియో నిర్వచించితివి కాని,

మ కవచంబున్ వరకుండలంబులను భిక్షన్ గొంటకై వచ్చి యా
సవనాధీశ్వరుఁ డింద్రుఁ డాఁచికొని మోసంబెంతయో చేసె నా
జవసత్వంబులు లాగి యర్జునునిచేఁ జంపింప నూహించు శా
త్రవవర్గంబున నీవు లేవొకో ముకుందా! మాట లింకేటికిన్

ఇది యటుండనిమ్ము ఓచక్రి! మహామహనీయమైన నీ శక్తి నేనెఱుంగక కాదు కాని నీవు మహోన్నతస్థాన మలంకరించియు సామాన్యమానవునివలె స్వల్ప కార్యములకుఁ గడంగి కులక్రమాగత మైన మర్యాదను వదలివేయు చున్నాఁడవు

కృష్ణ—అదియేమి

కర్ణు—ఏమా! నాఁడు రాజసూయమునకు వచ్చిన ఛప్పన్న దేశాధీశులమధ్య మహామహుఁడైన భీష్ముఁడు ఎవని కగ్రతాంబూల మిచ్చినాఁడో ఎవరు నరకాసురాది మహావీరాధివీరులను నిర్జించిపేరెన్నికఁ గాంచినాఁడో అట్టి నీవు పాండవదౌత్యమునకు కుదిరితివి

ముస్ముందు సాన్నిధ్యముకూడ సేయుదువేమో ! చూడుము

ఉ జూత్యపణంబునన్ శకుని నుంచి సుయోధనుఁ డాత్మగౌరవ
ఖ్యాతిని నిల్పి పాండవుల గర్వమణంచెను ధర్మసూతియా
నీతియెఱుంగకోకితవునింబలె పన్నిదమొడ్డి రాజ్యమున్
నాతిని యోడిపోయెను జనంబు లిసీయని నిందలాడఁగన్

కృష్ణు—నీసంగతి చెప్పవేమి ? నీప్రభువు

తే గీ దానకర్ణుఁడనుచు నిన్ను ధరణిఁ బిలువ
విని సహింపక యలిగి యాపేరు తనకె
కలుగవలెనని వాకిట గంటకట్టి
దాత దుర్యోధనుండు కాఁ దలఁచినాఁడు

కర్ణు—(పైపద్యము చదివి) ఇందు తప్పేమున్నది ?

ఉ దాతలు పెక్కురున్న మన దాత్రికి శ్రేయమెగాని హానియున్
భీతి యొసంగ దింతయును పేరునకో సుకృతాప్తికో జన
వ్రాఁత వశంకరంబునకొ వ్యర్థపు డంబములాడికొంటకో
దాతలు గల్గనిమ్ము విదిదర్మము లొక్కనికాణయాచియే

విదు—అగునది నిక్కము

కర్ణు—మీఅర్జునుఁడుగూడ ధనదాత కాఁదలంచినాఁడు

తే గీ నీ ఋణముజేసి నీపార్థునకు నిచ్చి
పంచినావు పేదబ్రాహ్మణులకు
ఇనుఁడు జలములాఁగి యింద్రుని పేరవ
ర్షింపఁజేసి నదులు నింపినట్లు

కృష్ణు—కర్ణా ! నేనొక్కమాట చెప్పెదను నవహితుఁడవై యాలింపుము

కర్ణు—అవస్యము అది ఏమి ?

కృష్ణు—నీజన్మవృత్తాంతము నీవు సూర్యునివలనఁ గుంతికిఁ బుట్టితివి.

కర్ణు—కావచ్చును

కృష్ణు—కుంతి తన కన్యాత్వము దాచిపుచ్చుటకై నిన్నొకపెట్టెలోఁబెట్టి నదిలో విడిచివైచినది. అది ప్రవాహవేగమునఁ గొట్టుకొనిపోయి రాధాదవునకు దొఱికినది. నిన్నుచూచి వారు పెంచినారు

కర్ణు—సరె ఇంక నేను చేయవలసినదేమి ?

కృష్ణు—కుంతీదేవిని నీవు తల్లిగా భావింపవలయును

కర్ణు—కృష్ణా ! ఇది మిక్కిలి యాశ్చర్యమైన సంగతి

ఉ. కుంతికిఁ బుట్టినన్ మఱికకుంతకుఁ బుట్టినఁ బుట్టనిమ్ము నే
యింతికొ మానవుండు జనియించుట తద్యము నాకు దానికై
వంత యొకింతలేదు బలవంతముగా నిది తల్లియంచు నీ
వింతగఁ జెప్పనేల పెఱయింతులు తల్లులుదారె మాధవా !

కృష్ణు—కర్ణా ! అది సరే ! పెరయింతులు పరవనముల సంగతికై నిన్ను నేను బిలువలేదు. కుంతి నీతల్లి యనురహస్యము నీతోఁజెప్పి మీ చుట్టఱికము అశిథిలానురాగ సముత్సుకసువర్ణశృంఖలములతో బందించవలయు నని నా సంకల్పము

కర్ణు—నీ పవిత్రమైన మహదాశయము మిక్కిలి సంస్తవనీయము కాని కృష్ణా ! ఒకసంగతి చెప్పుము

ఉ పిల్లలఁగాంచి నీటఁబడవేసిన భీష్మునితల్లిరెండు నా
తల్లి దయావిహీనలని ధాత్రి నిదుర్యశమందినారు ప్రే
పల్లెకు నీదు తల్లి నిను బంపి యశంబును గాంచెఁగాదె వీ
రెల్లరు కాలగర్భమున కేగెదరైన చరిత్ర లేగునే

కుంతి—(ప్రవేశించును) నేను మంచిసమయమునకే వచ్చితిని

(అందఱులేచి నిలువఁబడుదురు)

కుంతి—నాయనా ! కర్ణా ! సహజమైన కవచకుండలము లిచ్చివేసి నీవు నేఁడు

మిగుల దిస్సవోయియున్నాఁడవు

కర్ణు—లేదు నామనస్సు మిగుల తేజస్సుతో నిండియున్నది

కుంతి—నీవు ఈ కృష్ణభగవానునిమాట లెంతమాత్రమును తిరస్కరింపకుము. వేదవాక్యములవలె శిరసావహించి యాచరించుముతండ్రీ ! సర్వశుభము లను పొంది వర్ధిల్లఁగలవు

కృష్ణు—నీవు పాండవపక్షమున కరుదెమ్ము నీకు దర్మరాజుచేతను తక్కిన నలువురన్నదమ్ములచేతను సకలోపచారములు చేయించెదను మఱియు నోకర్ణా ! పాండవపంచకముచే నిన్నగ్రజన్మునిగాఁబూజింప సేయుటయే గాదు

ఆ గీ ఎవతెకొఱకు మీర లీరేడులోకంబు
లీడుగావటంచు నెంచినారొ
అట్టి ద్రుపదుపట్టి నాలిగా నీకిత్తు
నింకఁ గోరఁదగినదేది కర్ణ !

కర్ణు—మాధవా ! ద్రుపదుపట్టియగు కృష్ణను సుయోధనునివంటి మహారాజును గ్రుడ్డివానికొడుకని నవిక్షేపించినయాజ్ఞసేనిని నాకాలిగా సమర్పించెదవా! నీవెంతటికైన సమర్థుఁడవే కాని కృష్ణా !

మ పరకాంతన్ జననీసమానమని నే భావింతు పాంచాలి బం
గరుపాంచాలిక సుందరాంగియయినన్ గావచ్చు లోకాన నెం
దఱు సౌందర్యవిరాజమానలగు కాంతల్ లేరు వారెల్ల వ
త్తురె కాంక్షించిన నన్యకాంతలరతుల్ దోషంబు గాకుండునే.

కృష్ణు—సరే కర్ణా ! నేనెందు కీసంగతి నీకింత స్పష్టముగా వివరముగా నొడి వితినో దూరమాలోచింపుము రథకారకుల సంజాతుఁ డనుమ హాకళంకము సంపూర్ణముగాఁ దొలఁగిపోవుటయేకాక సర్వసర్వం సహాచక్రమేకఛత్రముగా పాండవులఁగూడి పరిపాలింపఁగలవు నీయశము

భారతజాతీయగీతములలోఁ గలిసి గానము సేయఁబడును

ఉ ఈమహనీయబాంధవము నీయవకాశము పోవనీయకా
కామిని కృష్ణ నీకు నిజకామినియౌను సముద్యముద్ధతం
బౌ మహిజిక్కు నీ కరతలామలకంబుగ వీనిగొంట రా
వేమి సుయోధనున్ విడువవేమి శుభంబులు మానుకొందువే

కర్ణు—కృష్ణా ! యిదియెంతమాత్రము సరిపడనివావి

సీ. పాండుపంచకమని ప్రఖ్యాతిగాంచువా
రలలోనకా నీనుఁడలరలేఁడు
నేఁటిదాఁకను సూతవాటిలోఁ బెరిఁగిన
రాధేయుఁ డిపు డొక్క రాజు గాఁడు
ఒక పేద శూద్ర కన్యక భార్తయగు కర్ణుఁ
డల ద్రౌపదికి భర్తయనఁగఁబోడు
దుర్యోధనుని మైత్రి త్రోసి రాజని మీకు
దోసిలొగ్గ శ్రవుండు ద్రోహి గాఁడు

తే గీ బలమునకు బెగ్గడిలి మీకు వశము గాఁడు
సొమ్ములకు లొంగి మీకు దాసోహమనఁడు
బానలను గోరి మీకు కై బాపులిఁడడు
తన తనూజుండు కురు సుయోధన సఖుండు

కుంతి—నాయనా కర్ణా ! గతమంతయు మఱపి సాక్షాద్విష్ణు స్వరూపుఁడైన మాధవుని నుడువు లాలకించి పాండు నందనులను నీవు సముద్ధరింపుము తండ్రీ ! చిరంజీవివై సుఖపడియెదవు

కర్ణు—ఈ నూతన సృష్టియు నీనూతన మర్యాదలును నడుమంత్రపుకలిమి. జనాపవాదమునకుఁ గారణము. అసహ్యము, తుచ్ఛము, సర్వాత్మనా వాకనగత్యము.

విదు—కర్ణా! సకలధర్మవిదులైన పెద్దలమాటలు తృణప్రాయములుగాఁద్రోసి వేయఁ జనదు అందులో తల్లి, పూజ్యురాలైన గొంతిఅమె కోర్కెనైనఁ జెల్లింపుము

కర్ణు—అమ్మా

సీ సూర్యు నంతటివాని సూనుఁ డంచెఱిఁగియు
కృపమాలి గంగ కర్పించినావు
చిరకాలమై పాసి చిత్తంబులో రోసి
మరణించెనని కర్ణు మఱచినావు
సూతుని సుతుఁడనై సూతకన్యను గూడి
కాపురంబును సేయఁ గాంచినావు
పాండు నిల్లాలివై పడసిన పుత్రుల
గెలిపింపఁ నన్నొంపఁ దలఁచినావు

తే గీ నిజముగా నన్ను తొమ్మిది నెలలు మోసి
కాంచియుండిన నాస్థితి గాంచి నీదు
కడుపు చుమ్మలు చుట్టుక పడకయున్నె
తల్లి గొంతెమ్మ కోర్కెలు జెల్లునమ్మ

కుంతి—(తలవంచి) నిజము కుమారా! నిజము నీయెడ నేను రాతికంటె కఠినురాల నసుటలో నతిశయోక్తి లేదు కాని—

ఉ పార్థుఁడుగాని పాండుసుత పంచకమం దెవరైన నీకు ప్ర
త్యర్థులుగారు ద్రౌపది సతంబును నిన్ మది గోరుచుండు నే
నర్థిదలంతు నీశుభమహర్నిశ మీస్వకుటుంబ మాపదన్
వార్ధిని మున్గిపోఁగనెదవా! కరుణింపవ! చిన్ని తమ్ములన్

కర్ణు—అమ్మా! ఇది నాస్వకుటుంబమా! వారు నాతమ్ములా! అగుగాక

శా ఏనో పార్థుఁడొ వీరలోకమున మున్నే నిల్చి ప్రత్యర్థులై
ప్రాణాలొడ్డి రణంబు సేయుటకునై బాసాడి యున్నాము నీ

వానాఁ డేమయినావు ద్రౌపది వివాహార్థంబు నేతెంచనాఁ
డే నన్ బిల్చిన నింత పుట్టునటె తల్లీ మాట లింకేటికిన్

కృష్ణు—(తలపంకించి) అగుననుము కాని కానీనా

ఉ పార్థుని గెల్వలేవు బలవంతుఁడవై నను నీవుకర్ణ యీ
వార్థులు ముంచవచ్చినను వాసుకి కోరలు విప్పివచ్చినన్
స్వర్ధుని నెత్తిపైఁబడిన చండహుతాశనుఁ డెత్తి వచ్చినన్
వ్యర్థము పార్థుజంపఁగలవారు త్రినేత్రుల లేరు జూడగన్

కర్ణు—మాధవా! ఈబీరములకేమి పార్థునిపేరు వీరలోకమునన్న నారీ లోకమున విశేష విఖ్యాతిగాంచియున్నది

చ అతివ నటించు పేరున బృహన్నలనంచును వేశ్యాశాప సం
హతమతినంచు బొంకి విరటాధిపు నంతిపురంబు జేరి యా
యతివలతోడ నాట్యముల నాడుచు పాడుచు వారిగౌరవ
ప్రతతిని పాడుజేసినిది పార్థుఁడె కాదొకొ నందనందనా!

కృష్ణు—కర్ణా! నీవన్నదెన్నటికిని భావింపకుము నిజముగా అర్జనుఁడు శాప హతుఁ డగుటచేతనె విరటుని మందిరమున నాడుదానివలె నటించినాఁడు కాని అంతమాత్రమున వేరుఁడు కాఁడనఁ జెల్లునా ?

ఉ. సర్వధనుష్కళావిదుఁడు శౌర్యధనుండల కాలకేయులన్
గర్వ మణంచినాఁడు దివి ఖాండవమున్ దహించినాఁడు గం
ధర్వులఁ ద్రోలినాఁడు కురు ధాత్రిపతిన్ విడిపించినాఁడు ఆ
శర్వుని గెల్చినాఁడు నరుసాటి నరుం డిలఁ గల్గనేర్చునే

కర్ణు—అగునగును నరుసాటి నరుం డుండఁడు కాని కృష్ణా!

ఉ శర్వుని గెల్చుటన్న దొక సాహసమా ? యతడల్గివచ్చినన్
సర్వజగంబులున్ గుసుమ సాయకుఁడున్ త్రిపురాసురావసల్
బుర్వుల లీలమాడి పడిపోయిరి యర్జునుఁడేమి లెక్కయా
పార్వతి ముద్దుదీర్పఁ దన పాశుపతంబిడెగాదె వానికిన్

కృష్ణ—కర్ణా ! నీ సంయానులాపంబుల కెంతయు సంతసింపవలసియున్నది కాని మొన్న మొన్నను జరిగిన గో గ్రహణమునాఁటి ముచ్చట లప్పుడే మఱచితివా ?

కర్ణ—అవి ముచ్చటలే నేము గో గ్రహణమను మిషచేవచ్చి పాండవులజ్ఞాతవాస వ్రతభంగమును గావించితి మదే మా విజయము ఈశ్వరుని గెల్చుట యెట్టిదో అర్జునుడు మమ్ము గెలుచుటయు నట్టిదే

కృష్ణ—

తే గీ మత్స్యయంత్రంబు తెగటార్చి మరలునపుడు
చెలఁగి కేళీ రణంబులు సేయునపుడు
పరఁగగో గ్రహణార్థమై వచ్చునపుడు
అర్జును నెఱింగి పొరపడ నగునె చెపుమ !

కర్ణ—కృష్ణా ! మేము పొరపడుటలేదు ఆపని నీది

మ గయునిన్ నీవు శపింపఁ బార్థుఁడు భుజంగంబట్లు నిన్ మాల్కొనన్
గయుపక్షంబున నిల్చి పాండవులసఖ్యం బిట్టిదే చూడుమా
నయహీనాత్ములొ మేమొ శత్రులము కృష్ణా నీకు, నూహింపు, నీ
భయమున్ గల్గియె పీడినామడవులన్ బ్రాణాలతో వారలన్

విదు—ఈవాదము లస్తినాస్తికములవలె ననంతము లైనవి

తే గీ హితములాడియాడి యిది నీకు కర్తవ్య
మనుచు జెప్పఁ గృష్ణుఁ డంతవాఁడు
తల్లి కుంతిచెప్పె తగనే వచించితి
కాని వినవు మూర్ఖగతిని కర్ణ

కర్ణ—తాతా !

ఉ॥ నీతికి నీవు పేర్వడిన నేతవు నీదు మతంబు లోకవి
ఖ్యాతము వెల్లరే విదుర కౌరవులన్ విడనాఁడు మంచనే
రీతిని చెప్పఁగాఁగలవు కృష్ణుఁడు చెప్పినఁ జెప్పుగాక నా
యాతనువున్నదాఁక భజియింతు కృతఘ్నుఁడగాను జేనికిన్

కుంతి—నాయనా! నామాట యేమి చెప్పెదవు? నేను నీకు తల్లిని నా యేవురు కొడుకులను నాలములోఁ బట్టి చంపనని వరమిచ్చి నాఋణము దీర్చుము లేనిదేనిన్ను కొంగుబట్టియాచించుచున్నాను పుత్రా కర్ణా! నన్ను దుఃఖార్ణవమున ముంచఁబోకుము నీకు నేతి నిజముగా తల్లిని

విదు—

తే గీ కవచకుండలములఁ గాదన కిచ్చితి
వర్థికపుడు తల్లి ననుచు వచ్చి
చేరె యామెకోర్కె చెల్లింపఁగా రాదె
లేదె దానపదము నీదె కాదె

కర్ణ—

ఉ॥ తల్లివొకావొ నే నెఱుఁగ దైవ మెఱుంగునుగాని నీవు నా
తల్లివటంచు జెప్పితివి దన్యుఁడనైతిని నిప్పుడీవు నా
వల్ల ఋణంబు దీర్చుకొన వచ్చినదానవు గాన నర్జునుం
డల్లన మానినీ కొడుకు లందఱి వీడెద నాజిలోపలన్

(అని నిష్క్రమించును)

కృష్ణ—మన మింక సంపూర్ణకృతార్థులమైనారము.మనకొఱంతలన్నియు దీరినవి.
విదు—అదియెట్లు? అర్జునునితెగటార్చెదనన్న కర్ణునివాక్య మమోఘముకాదా!

కుంతి—నాయర్జునుఁడే తెగిన నాకిఁక లోకమే లేదు (అనిమూర్ఛిల్లును)

విదు—అర్జునుఁడు లేని పాండవులు శిరములేని మొండెములు

కృష్ణు—అగునది వాస్తవము అర్జునుని నేను కాపాడెదను తక్కినపాండవ చతుష్టయమును కర్ణుఁడే విడిచివేయును అది మనకు మేలుకాదా? మఱియు నోమామా!

చ ఎవనిశుభంబు గోరుచును నీవిధివాదము జేసినాఁడొ ఆ
యవనిధవున్ సుయోధనుయమాలయమంపెడు భీమువీడి కౌ
రవకులమార్చెకర్ణుఁడు కరంబుల మిత్రుని సాకఁబోయి శా
త్రవులకుఁ దోడ్పడెన్ విదివిధానమలంఘ్యము నెట్టివారికిన్

(తెరదిగును)



# మహాభారత కౌరవరంగము

## చతుర్థాంకము



రంగము—కురుక్షేత్రము

(కౌరవపాండవసేనామధ్యరంగమున కృష్ణార్జునులు రథమెక్కి ప్రవేశింతురు)

కృష్ణ—అర్జునా! నేడెంత శుభదినము ఈపుణ్యక్షేత్రమగు కురుక్షేత్రమున మనసేనయు భీష్మాదిద్రోణాచార్య పరిరక్షితమైన కౌరవసేనయు నెట్లు విరాజిల్లుచున్నదియో చూచితివా! నేఁడీదుర్యోధనాదులు తా మొనరించిన దుర్ణయముల ఫలమనుభవించుటకు సంసిద్ధముగ నున్నారు మఱియు

ఉ. పాపకళంకమాకృతులపై మసిపూఁకినరీతిఁద్రోఁప నీ
కాపురుషుల్ రణావనినిఖడ్గములన్ గొనియున్నఁ బోరఁగా
నోపరు దుర్మదాంధుల సమున్నతియాఱిపోవు దీ
పాపచయంబువంటిది భయానహమైనది చూడు మర్జునా!

అర్జునా! నీకిచ్చట జయమును శత్రువులైన కౌరవేయులకుఁ బరాజయమును విధిప్రేరితమైనదని నీవు తెలిసికొనుము.

అర్జు—అగునుగాక. కాని

ఉ. మిత్రులు నన్నదమ్ములు సమీపపుబంధులు మేనమామలున్
బుత్రులు బావమర్దులు ప్రబుద్ధులు తాతలుగ్రాలు నీకురు
క్షేత్రము పెండ్లిపందిరనఁ జెల్లుచునున్నది యిందు వీరి నే
శత్రుని కైవడిన్ బిలిచి చంపఁగనేర్తు నె రక్కసుండనై

కృష్ణ—(స్వ) ఓహో! ఈతఁడు సమరపరాఙ్ముఖుఁడై మెల్లగాఁ బాఱిపోవనూఁ కించుచున్నట్లున్నది.

ఎట్టులో వీనిని దిద్ది యీజైత్రయాత్రసాగింపవలయును లేనిచో యీదుష్ట సంహారము కానేరదు. (ప్ర) అర్జునా! ఏమంటివి? (పైపద్యమును జదివి) అనియా ఆహా! ఆకౌరవులు మీయెడ నొనరించిన మహాపరాదము లప్పుడే మఱచితివా ?

అర్జు—లేదు కాని

చ గతజలసేతుబంధనము గాదె గతించిన మేలుకీళ్లసం
గతి తలపోయనాఁడు మనకాలము పెడ్డదిగాన శత్రులా
గతికి కురించినారు భవకర్మపలంబులు దప్పవేరికిన్
క్షితి, గతకాలమున్ దిరిగి చేకురునే రిపులాజిగూల్చినన్

కృష్ణ—మీరజ్ఞాతవాసమున నిడుమలఁగుడుచుచున్నను మీవెన్నాడుటమానక గోగ్రహణమనుమిషచే నెంత కీడాచరింప సమకట్టినారోయొకసారి తలంచు కొనుము

అర్జు—అగును.

ఉ కాలముపెడ్డదైన రిపుకాండములేమి స్వదేహరక్తమే
చాలు విరోధమై వెతలఁ జంపుఁ గిరాతుఁడు లేడినేయ నా
కోలపలాయనంబగుచు కొద్దిగ గాయముజేసెనేని యా
బాలకురంగరక్తమెట పాఱినబోయకు దారిజూపదే!
అట్లే మేము మాదుర్దినములలో దుఃఖము లనుభవించినాము

కృష్ణ—ఇప్పు డవి తీరినవా ?

అర్జు—తీరకపోయినను నేనీబందువధ మొనరింపనోపను.

సీ ఈబంధువులఁ జూచి నాబొంది కంపించు
రోమహర్షముపుట్టె నేమి సేతు
గాండీవమీచేతినుండి జారును తను
వుడు కెత్తెనిచట నేనుండలేను

అపశకునము లెన్నొ యగుచున్నవిఁక శ్రేయ
మీబంధువులఁ జంపి యెటులఁగొందు
విజయంబు రాజ్యంబు విభవంబు జీవంబు
నాశింప నీవు నేమన్నఁగాని

కర్ణదుర్యోధనాదులు ఖలులెకాని
వారిఁ జంపినపాపంబె వచ్చుమనకు
వారు మము జంపి ముల్లోకవైభవములఁ
బొందఁగానిమ్ము నాకు నిబ్బందిలేదు

కృష్ణ—ఇట్లని నీవు రణోపసంహారమునకు దారితీసిన నటుపై యేయాపదలు పుట్టునో నూహింపకున్నాఁడవు

ఉ భీరుఁడు నర్జునుండు రణవీధిఁ దొలంగియు బాఱిపోయె కాం
తారదురంతసీమలకు దారుణ కౌరవవహ్నిదాఁకఁగా
నూరక మాటలే యల సుయోధన భీష్మకకర్ణ దుస్ససే
నారమణీయమైన కదనంబని లోకులు చెండనాడరే

అర్జు—ఆడిన నాడనిమ్ము. కాని యీ యుద్ధమే సాగించిన నెన్ని కుంటుబములు ఎన్నికులములు నిర్మూలములై నిరాధారములైపోవును

మ కులనాశం బొనరింపరాదు కులసంక్షోభంబు గావింప నా
కులకాంతా నిచయంబు భ్రష్టయి శచిౘ గోల్పోవు దుశ్శీలమై
కులమున్ సంకరమౌను, సంకరులు మూర్ఖుల్ కర్మముల్ సేయకే
ఖలులై పోదురు వారితో మనకు దుఃఖప్రాప్తి చేకూరెడున్.

(అని చతికిలఁబడును)

కృష్ణ—

ఉ చాలును జాలు నీవగపు జాలు గ్రహింపఁగనయ్యె నీకు నే
లీల జనించె తుచ్ఛము మలీమసమౌ విషయేచ్ఛ మోహమా

శీలమనార్యసేవితము భీరువుబోలె దురంబు మానెదే
చాలును లెమ్ము యుద్ధమును సల్పుము భారతకీర్తి నిల్పుమా

అర్జు—కృష్ణా! నన్నేల యీ యడియాసలకు దింపెదవు ?

ఉ ఉత్తములైన భీష్మగురుయోధుల యుద్ధములోనఁజంపి యా
నెత్తురుఁగూడునుం గుడువ నేనిఁక బిక్షమునెత్తి కాలమున్
బుత్తును నోడు గెల్పు లెటుబోవునొ తెల్పఁగరాదు శాంతిరే
కెత్తఁగ దారిజూపు మది యింద్రపదంబునకంటె మేలగున్

కృష్ణు—

తే. గీ పండితునిభంగి నీతులు పలికెదీవు
వగవఁ బనిలేనివారికై వగచె దేల
బ్రతికి యుండినఁ జచ్చిన వారికొఱకు
వగవ నొల్లరు పండితవర్యు లెపుడు

ఉ ఏ నవినాశనుండ నటు లీవును నాశములేనివాఁడవే
యీనృపు లెల్ల నిత్యులు నశించిన దేహము నాత్మనిత్యమే
కాన గళత్ జరామరణకారణమైన యవస్థలన్ని యీ
మేనికెగాని యాత్మను గమింపవు దానికి దుఃఖమేటికిన్.

సీ. బాల్యకౌమార యౌవనము లట్టులఁ బున
ర్జన్మ వచ్చును జీవజాలములకు
శీతోష్ణ సుఖదుఃఖ భీతుఁడవై పోక
యొగివాని నన్నిటి నోర్చుకొనుచు
ఆత్మ నిత్యంబు దేహం బనిత్యంబను
సదసద్పదార్థ విజ్ఞాన మెఱిఁగి
పుట్టని చావని పొంతఁబోవని యాత్మ
చావదు చంప దేసమయమందు

తే గీ జీర్ణవసనంబు విడిచి మంచిదియు నూత్న
వస్త్రమును గట్టునట్టు లీయాత్మ ప్రాఁత
దేహమును వీడి కొను క్రొత్తదేహమునను
గాన దీనికై వగచుట మాను మింక

మఱియు నో కౌంతేయ

ఉ అచ్చపు ధర్మదీక్షను దురాత్ములఁ జంపఁగఁబోయి నాజిలోఁ
జచ్చిన వచ్చు స్వర్గము నిజంబుగ గెల్చిన రాజ్యభోగముల్
వచ్చును గాన లెమ్ము మఱి పాపముఁబొందవు కర్మయోగ సం
పచ్ఛ్రయమెల్లఁ జెప్పెదను బంధవిముక్తికి నాత్మశాంతికిన్

సీ మునుసూర్యునకు నేను వినిపించితిని దీని
నినుఁడు వైవస్వత మనువునకును
బోధించె నతఁడు సఁబోధించి యిక్ష్వాకు
నకునెఱిఁగించె తత్సకలమతఁడు
ఋషు లందరికిఁ దెల్పు యీరేడు లోకాలు
తరియింపఁజేసెనా తత్త్వ మిపుడు
నీకు వెండియుఁ జెప్ప నిశ్చయించితి పార్థ
అవహితుండవై విను మావిధంబు

తే గీ అగ్నికట్టెలఁబడి కాల్చునట్లు కర్మ
లన్ని జ్ఞానాగ్నిలోఁబడి యంతరించు
నపుడు నగుపడు జగము నీయందు నట్టి
నీవు నాయందు నిన్ను వీక్షింపఁగలవు

అర్జు—

తే గీ నీవు మొనమొన్న దేవకీదేవి గర్భ
శుక్తి ముక్తాఫలంబయి శోభఁగాంచఁ

గాంచఁబడితివి తరణి కేకరణి తత్వ
బోధఁజేసితివో నాకు బోధపడదు

కృష్ణ—ధనంజయా! నే నవినాశనుఁడను

మ ఒకమారీ నిఖిలప్రపంచ నిజసృష్ట్యోద్దేశమర్థించి యం
దకలంక ప్రతిభావిభాసమగు దివ్యానంతతేజః ప్రపం
చకాళానంద రసస్వరూపమును లక్ష్యంబందు వీక్షించినన్
వికలం బందని నన్ను జూడగలవో విశ్వాకృతిన్ భారతా

శా స్వాతంత్ర్యంబు నిజానురాగము ముముక్షుత్వంబు బంధంబు ని
ద్యాతత్త్వంబున నిల్పఁబూనిన నిధి ధ్యానంబులో దృశ్యమై
పాతాళంబుల మెట్టి పైకెగసి దివ్యద్యోదు సీనాక సం
ఘాతంబున్ బెకలించు నేననెడు యోగజ్ఞాన మార్జింపుమీ.

ఉ మానవశక్తి మానసిక మార్గణముల్ వెలిజిమ్మి యాత్మ ని
జ్ఞానముచేత సృష్టిని ప్రకంపితమున్ బొనరించి యాతమిన్
భానుసహస్రమండలము భాతి వెలింగెడు నన్నుఁజూచి దృక్
స్థానము మార్చుకొమ్ము జడసంసృతిబోయి సుఖింతు వర్జునా.

ఉ జ్ఞానవిధానసిద్ధి నిజ సంస్కరణంబులఁ బొందనెంచు వి
జ్ఞానులు మానవత్వము ప్రజాప్రతి పాదక వామమార్గముల్
మాని స్వరూపనాశనము మాటున దాఁగిన జీవశక్తిలో
గానఁగవచ్చు నీశ్వరునిగాఁ గనుచుందురు నన్ను భారతా!

శా నీకున్ జ్ఞాపకి ముండవచ్చు విశిఖానీకంబు వర్షింప ము
ల్లోకంబుల్ తెగమాడ్చునాఁడు దనుజుల్ బుత్తెంచి విశ్వంబుదా
మాకర్షింపెడు నాఁడుకాలయవనుల్ మార్కొన్న యుద్ధాల నే
నైకావక్ష సచరాచరంబయిన బ్రహ్మాండంబు రూపించెడున్.

ఉ ధారణఁజేసి మృత్యువును దన్నిజితేంద్రియులై శరీరసం
స్కారవికార వీచికల సంగతిబోక నిజాత్మతత్త్వ వి
స్తారతమోవిదూత వివిధప్రతిపాదకమైన తేజ మె
వ్వారు గ్రహింతురో యదియె స్వర్గము నేనని జూడు మర్జునా

ఉ ఆటల నాడుచున్న పరమాణువులన్ విడఁదీసి వానిలో
మాటయియున్న యా వెలుఁగుమధ్య సుధామధురంబులై జగ
న్నాటక సూత్రధారినగు నా నిజరూపము జూపుచున్ సదా
పాటలుపాడు నామురళివంకను జూడఁగలేదె యర్జునా ?

ఉ ఆయమునానదీ పరిసరావని వేణువు బూని యాసుధా
మేయమనోజ్ఞ గానరవ మిశ్రితగీతములేవి పాడినా
నో యవె నేఁడనంతము మనోహరరాగరసంబులో నుపా
ధ్యాయునిరీతి గీత నమృతాకృతి జెప్పితి నన్నెఱుంగగన్

ఉ ఆలము శత్రుభంజన మహామహితాత్మకమై ప్రాభాతతే
జోలసితప్రభాపటలశోభిత సృష్టి విలాస విహ్వలో
ద్వేల నిగూఢతత్త్వ నిజదీప్తివినూత్నతఁ దెచ్చిపెట్టునీ
కాలము వచ్చునే విరిగి గాంచెదమేమన మెన్నఁడేనియున్

సీ దివ్యులమెప్పించి దివ్యాపగనుబట్టి
దివినుండి నేలకు దింపునాఁడు
రక్కసులనుబోరరక్తముల్ పాఱించి
శరవాహినుల మ్రోలఁ బెరుఁగునాఁడు
సామగానంబులు సవనంబు లొనరింప
సృష్టికిఁ బ్రతిసృష్టి సేయునాఁడు
భూమి బాఁపఁగజుట్టి నామావశేషంబు
జేయవచ్చినవారి జీల్చునాఁడు

తే గీ భారతీయ యశఃకాంత ప్రణుతగీతి
కలను దిక్కుంభికుంభాల నిలిపిపాడె
నాఁటి జాతీయకీర్తియే నాఁటికైన
మఱువఁగారాదు, అర్జునా! వెఱువవలదు

అరు—

శా నీమాయార్ణవ మెంత లోఁతు గలదో నీతేజ మేలాటిదో
ఏమో నీనిజరూప మేవిధమునన్ వీక్షింపఁగా వచ్చునో
ఏమార్గంబున నిన్ను జేరఁ గలమో యెవ్వారెఱింగింతు రీ
భూమాతీతలసత్కళాకలిత దివ్యోదంచితా అచ్యుతా!

కృష్ణ—అదిగో చూడుము నా విశ్వరూపము (అనిచూపును)

అర్జు—(చేతులు మోడ్చి)

దండకము

నమో దేవదేవా నమో సర్వలోకేశ సర్వప్రకాశ భవద్విశ్వరూపంబవాచ్యం బచింత్యం బనంతం బవాఙ్మానసం బప్రమేయం బనూహ్యంబసత్ స్వరూపంబునై లోకమై భూతకోటిన్ విడంబింపి దీపించు నిన్నెంచ నేనెంతవాఁడన్ భువర్లోకముఖ స్వర్గపాతాళముఖ జీవజాలంబులున్ సర్వతేజః ప్రపంచంబ విచ్ఛిన్న నిర్వార గాఢాంధకారంబు నీలోన నిండారి నీగర్భ భాండంబులోనుండి రోపించు ఈకౌరవశ్రేణికాలాహి కంఠంబులోఁజిక్కి మాంపాహి పాహీ యిటంముఖ నశించున్ మహాఘోర మీదారి యీసారి వారించి నన్నున్ బ్రసాదించి రక్షించవే దేవదేవ నమస్తే నమస్తే నమః

(తెరపడును)

---

# మహాభారతకౌరవరంగము

## పంచమాంకము



రంగము—కురుక్షేత్రయుద్ధభూమి.

(భీష్ముఁ డంపశయ్యపై పరుండియుండును.)

(పాండవులు విదురుఁడుచుట్టును గూర్చుండియుందురు )

(కర్ణ దుర్యోధనులు ప్రవేశింతురు )

కర్ణు—ఓసుయోధనమహారాజా! మీకురుకులపితామహుఁడైన భీష్ముఁడొనరించిన కృతఘ్నత వింటివిగదా ?

దుర్యో—వినుటయేగాదు కన్నులారఁ జూచితిని

కర్ణు—ఈగాంగేయు నిఁక యుద్ధము మాన్పించవలసినదని నేనెంతచెప్పినను వింటివికావుగదా !

దుర్యో—

చ పదిదినముల్ మహాహవముపాండవవర్గముతోడఁ బోరి యీ
తుదిదినమున్ శిఖండి గని తోడనె విల్లును బాఱవేసి యీ
నదిసుతుఁడుఙ్ గృతఘ్నత నొనర్చెఁ బరాజయ మింక మాకు త
ప్పదు, తనపిల్లలన్ జననిభక్షణఁజేసిన లోకమాగునే.

కర్ణు—నిజము ఈతనితల్లి గంగ ఏడ్గురుసుతులను గాంచి కాంచనతోడనే చంపి గంగలోఁ గలిపినది చావు దప్పి కన్నులు లొట్టవోయినట్లు నీతఁ డెట్లో బ్రతికి పైకిఁబడినాఁడు కాని హంతకురాలిపుత్రుఁడు వంశాంతకుఁడగుననుట వింతగాదు.

ఉ. కాదనలేరు భీష్ముఁడన కౌరవ లోక పితామహుండు వి
ద్యాదయితుండు శూరుఁడుగదా ! తను నమ్మినవారు వంశమన్

బాదును పీఁకివై చుటకుఁ బాల్పడునే యిది పెద్దవాంఁడ్ర మ
ర్యాదయె శత్రుకోటి తన ప్రాణరహస్యము జెప్ప నొప్పునే.

దుర్యో—అదియేమి కర్ణా! మాతాతయగు నీభీష్మాచార్యులు శత్రువులతోఁ గలిసినాఁడా

కర్ణ—అగును

దుర్యో—అదియెప్పుడు.

కర్ణ—భీష్ముఁడు పోరిన దినములలో నొకనాడైనఁ బాండవులు దండిమగలవలె పోరాడలేకపోయినారు ఈపది దినములు గజతురగాది చతురంగ బలములు తెగి విగతప్రాణులై సప్తాక్షోహిణీ పరిమితంబైన మహాసైన్యము సన్నగిల్లిపోవ నారంభించినది ఇది కార్యముకాదని చింతించి యతి నిపుణుఁడును మాయానటకుఁడైన దర్మసుతుఁడు సహోదరుల వెంటఁ దీసికొని భీష్మునిపటకుటీరమునకుఁబోయి వాపోయినవాని తెఱంగున వాని నిచ్చకముల రంజింపఁజేసి తుదకు శిఖండిచేత నాతనికిఁ జావున్నదని తెలిసికొని వెడలిపోయినాఁడు.

దుర్యో—తరువాత

కర్ణ—తరువాత మరునాఁడు శిఖండిని వానియెట్టయెదుటఁ బెట్టి కలసేనయు సేనానాయకులును నొక్కపెట్టునఁ గలసి భీష్మునిపైఁ బడి కొట్టికొట్టి జంపి వేసినారు కాని పేరుమాత్ర మర్జునునకు వచ్చినది

దుర్యో—ఆహా! యేమి యీదురంతము

కర్ణ—ఆదురంత మటుంచుము ఇపు డాభీష్ముని యంపశయ్యచుట్టును పరివేష్టించి యున్నవారెవ్వరో చూచితివా?

ఉ॥ చంపినవారు చంపుటకు సాకులు పల్కినవారు దొంగ వి
ల్లొంపులుజేసి భీష్మునట నొంచినవారును వానిజేరి నల్

వంపుల( గూరుచుండిరదె పాండవపంచకమన్న వారిదే
తెంపునిలింపులైన వినుతింప(గ నేర్తురె యీకదార్ధముల్

దుర్యో—అహా! యెంతచిత్ర మెంతచిత్రము ఈపాండవహతకులెంతగుండె నిబ్బరము గలవారు! తాతను జంపి వచ్చినవానిని తిరిగి దర్శించుటకు వచ్చి గూర్చుండియున్నారు

కర్ణు—ఇట్టి మహామాయాసంపన్నులు గావుననే లోకము మోసపోయినది
దుర్యో—ఆయంపశయ్యయేమి ?
విదు—స్వచ్ఛందమరణాదిగుణగరిష్ఠు(డైన భీష్ము( డేకాదశీ పుణ్యదివసప్రవేశ పర్యంతము ప్రాణములు వాయననిబాణములు శయ్యగా గావించి యందు నిద్రించుచున్నా(డు
దుర్యో—మనమును పరామర్శించి వత్తము రమ్ము
భీష్ము(డు—

ఉ ఓసచరాచరాత్మక మహోన్నతతేజ జగత్స్వరూపసం
భాసితసత్కళాకలిత బంధుర ఓపరతత్వమూర్తి నీ
వే సహజాకృతిన్ నిలిచి యానిఖిలంబు నలంకరించితో
ఆసహజాకృతిన్ ననుగృతార్థునిజేయుము భక్తవత్సలా
శా ఆపద్బాంధవు(డీవు దీనులకు దిక్కై(చూచుచున్నావు నీ
రూపంబే కరుణామయంబు దిశలన్ రూపించుతేజోమయం
బాపోజ్యోతియజాండభాండముల కీవై నిండియున్నావు నన్
గాపాడన్ దలవంచి మ్రొక్కెద జగత్ కల్యాణసంధాయకా
మ. జలరాశిన్ విలసిల్లు వేచికలతో సఖ్యంబు గావించి పు
వ్వులతో నెయ్యము సల్పి తత్సుధలతోబొత్తై నభోవీధి జు
క్కలతో వియ్యములంది నీఘనఘనాకారంబు జింతింతు ని
ర్మలకారుణ్యసుధాప్రవృష్టి గురియన్ రావయ్యవిశ్వాత్మకా
(దుర్యోధనకర్ణులు సమీపించిరి.)

విదు—రారాజా! మీపితామహుఁడు శరతల్పగతుఁడై పడియున్నాఁడు. పోయి నమస్కరింపుము

దుర్యో—నమస్కరించిన నన్నేమైనఁ జిరంజీవి యని యాశీర్వదించునా ?

(పాండవులు లేతురు)

విదు—కౌరవరాజా! పెద్దలయెడ మనమవిధేయతగా నడువఁగూడదు భారతలో కపితామహుని నమస్కరించుట అవశ్యకర్తవ్యము. అదిశ్రేయోభివృద్ధికి మార్గము

ధర్మ—సత్యము సత్యము

దుర్యో—ఓహెూ! మీరా! ధర్మరాజులవారా! అగునగును అట్టి విషగర్భితమైన కపటనమస్కారములఁ గావించి సేవించియే యీముసలవాని ప్రాణము లుష్షని పీల్చి వేసినారు

కర్ణ—వీరు యమధర్మరాజుగారి సుపుత్రరత్నము కారా ?

దుర్యో—వీరు గొప్పమాయావాదులు

భీమ—ఏమంటివి ? మేము మాయావాదుల మనియా ఆహా! నీవెంత సాహసుఁడవు? నీమలీమసమైనచరిత్ర మొక్కింత తలంచుకొనుము.

శా. మాయాద్యూతమువెట్టిమావిభవముల్ మాయించి ఘోరాటవిన్
ద్రోయన్‌జేసి విషాన్నమున్ గుడిపి విద్రోహంబు గావించి మా
శ్రేయంబుల్ హరియించి మాపుడమి నిశ్శేషంబు బోకార్చి మా
జాయన్ ద్రౌపది చీరలొల్చి సభలో సాధింపవే దుర్మతీ

కర్ణ—ఓరీ! భీమా! నీభీమార్భాటము లింకఁ గట్టిపెట్టుము నాఁడు మీరు చేసినరాజసూయాధ్వరమనంతరము

తే గీ మీరె జూదంబుపెట్టిరి మీరె రాజ్య
మోడి రటులైనఁ దిరిగి మీ కుచితరీతి
విడచితిమి దాని తిరిగి మీపడఁతితోడ
కలిపి యోడితిరిఁకఁ దప్పుగలదె మాకు

దర్మ—ఓడితిమే యనుకొనుము కాని

ఉ పాపము సేయనట్టిది యశుభంబు శుభంబు నెఱుంగదింత యా
ద్రౌపది కొప్పుపట్టి కురురాజకదంబము నిండుకొల్వులోఁ
గోపముకొద్ది యీడ్చియట కోకలు విప్పి పరాభవించిర
య్యోపలుగాకులట్టులమ మూరకపోవునె యెందు డాఁగినన్.

దుర్యో—

ఉ ద్రోవదిధర్మపత్ని యని దొంగవచస్సులనాఁడెదేల యే
వావిని మీరవేవురు వివాహము జేసిరి దర్మశాస్త్రముల్
కేవల మొప్పుకోఁగలవె కిల్బిషమానసయామెబందకే
గావలెఁ గానరో వెలఁది కై వడి నీడ్చితి మప్డు కొల్వునన్

కర్ణు—ఇట్టి బహుపతివ్రత సత్యభామకు సాధ్వీత్వము నేర్చినది ఆహా!

ఆ గీ అభము శుభము దెలియదని ద్రోవదినిఁ బల్కా
దగునుగాని బంధు లైనవార
లింటి కరుగ వారిఁ గుంటిగుడ్డికొడుకు
లని పరాభవింప నగునె చెపుమ ?

అర్జు—

ఆ గీ. లక్కయింటఁబెట్టి యొక్కమారే మమ్ము
కాల్చి కథ ముగింపఁగాఁ దలంచి
నట్టి క్రూరకర్ములగు మీర లెన్నాళ్ల
యుర్విపైని బ్రతికియుండఁగలరు

దుర్యో—

ఆ గీ లక్కయింట మిమ్ము జిక్కించి చంపఁ గాఁ
దలఁచుటేల ? చంపఁదలఁచుకొన్న
నిపుడు చేయలేమె యిట మీకు దిక్కెవ్వ
రాగడములు పలుక నగునె తెలిసి.

నకు—

తే గీ విషము కలిపి కూడను తినిపించినారు
యమపురికి వేగ మము సాగనంపఁదలఁచి
ఆవిదంబెల్ల మఱచి మాయాప్రసంగ
మేలచేసెద వెఱఁగి సిగ్గేనిలేక

దుర్యో—

ఆ గీ విషము కలిపి కూడుపెట్టి నామను నింద
మీరె తెచ్చిపెట్టినారుమాకు
ఒకవిధాన-కీడు నొనరించిరే మీరు
చంకఁ దాఁగిన విషసర్పములుగ.

సహ—అగునగును నాఁడు కానలో మిమ్ము హరించి కాఁగలకార్యము గంధర్వులే తీర్చినారు అపుడు మేమడ్డుపడకున్న నిపు డింతవఱకు వచ్చియుండరు

కర్ణు—ఓరీ! వెఱ్ఱివాఁ గాచావు రెండుసారులు రాదు
భీష్మ—నాయనా! దుర్యోధనకుమారా! నోరెండి పోవుచున్నది నాకిన్నినీళ్ల పోయుము తండ్రి

కర్ణు—ఆసీళ్లేమో ధర్మజునే యాచింపుము
దుర్యో—తాతా! పండ్లను పాలను గైకొనరాదా?
భీష్మ—వలదు జలమే కావలయును
దుర్యో—(సేవకునిఁ బిలిచి) తాతగారికై పరిశుభ్రమైన జలముగొనిరమ్ము
భీష్మ—నాయనా! నాకవి పనికిరావు
దుర్యో—నేను స్వయముగఁబోయి గొనివత్తునా?
భీష్మ—వలదు నాకీ కురుక్షేత్రాంతర్గతమైన పాతాళజలము కావలయును.

తే గీ మున్ను నాయొజ్జ పరశురాముండు రాజ
రక్తము శమంత పంచకహ్రదములను ర

చించి పితృదేవతలను పూజించె, నిచట
ఈకురుక్షేత్రజలము నా కిడుము తండ్రి

కర్ణ—అగునగును నీగురువగు పరశురాముఁడు రాజలోకమును సంహరించి యీకురుక్షేత్రమున శమంతపంచకమనుపేర నైదురక్తపుమడుగు లేర్పరచి పితృదేవతలకు తర్పణముపెట్టి పోయినాఁడు నీవు ఆగురువు శిష్యుఁడవే గావున స్వవంశస్వసంఘ స్వజాతి స్వజనపవిత్రతేజోపిరాజితమై మహా రుధిరమును నీళ్లుచేసి త్రావిత్రేన్చి హాయిగాఁ బోవఁ జూచుచున్నావు

దుర్యో—తాతా! తృటికాలములో తృషదీరుటకు పాతాళములోని నీరెట్లురాఁగలవు

భీష్మ—నాకిప్పుడు పాతాళగంగ కావయును

కర్ణ—గంగాజలములు పనికిరావా?

భీష్మ—ఆమె నా తల్లి తల్లిపయస్సును నేనీప్రాణావసానకాలమునఁ గ్రోలనొల్లను

కర్ణ—నిష్కామున కీకోరికకేమి?

దుర్యో—తాతా! దాహమువేసినపుడెల్ల నుయ్యి త్రవ్వి నీరు త్రాగుటసంభవము గాదు అయినను నొకింతసేపు తాళఁగలవేనిఁ దప్పకనిట నుయ్యి త్రవ్వించెదను

భీష్మ—నేనొక గడియసేపైనఁ దాళలేను

దర్మ—అర్జునా! చూచెదవేమి?

అర్జు—ఓభారతలోకపితామహా! వీరాగ్రణి!

ఉ. నీవు మహానుభావుఁడవు నిక్కము నీవు తలంచితేని యీ
భూవలయంబు బద్దలయిపోయి జలంబులు పైకిరావె లే
వే వనదంబులున్ గురియవే మము ధన్యులఁజేయ నీరముల్
కావలెనఁటివీ విదిగొ కైకొను బాణమువేసి తీసెదన్

(అని భూమిలోబాణముదూరిపోవునట్లు కొట్టును జలము పైకిపొంగి వచ్చును )

భీష్మ—(దగ(దీర్చుకొని) విజయునకు విజయమగునుగాక

దుర్యో—(స్వ) ఈత(డు చచ్చియును మమ్ము సాధించుచున్నా(డు ఇది మాకొక విధమైన పరాభవము పరాజయము

కర్ణ—తాతా ! ఈవిజయునకు జయమగునని నీవు వేరే యాశీర్వదింపవలసిన పనిలేదు మాపరాజయమును పాండవుల విజయమును నీవు మొట్టమొదట నుండి కోరియే నీచావురహస్యము శత్రువులకెఱింగించితివి

భీమ—ఈభీష్ము(డు మీపరాజయ మూహించుచున్నా(డని తెలిసినప్పుడు మీరతని నేల వదలుకొనలేదు

కర్ణ—మమ్మే యాత(డు వదలుటలేదు పైపెచ్చు వంచించినా(డు

ఉ వైరులతో రహస్యములు వల్కె(డువా(డు యదార్థవాది కా
నేర(డు కౌరవుల్ తనకు నింద్యులటంచును దో(చినప్పుడీ
భారతసత్పితామహు(డు పాండవపక్షముపోయి నేరుగా(
బోరిన నీసుయోధను(డు మోసమునన్ బడి పొక్కియుండునే

ధర్మ—

తే గీ సర్వదర్మవిదు(డు సంగపరిత్యాగి
భీష్మ(డాచార్యు( డనుపేర వెలసినా(డు
అట్టి లోకపితామహు నభవు( దిట్టె
దకట నీనాల్క వేయిచీలికలుగావె

కర్ణ—అది నాకుగాదు నీనాలుక లక్షచీలికలు కావలసియున్నది మృషావాదీ ! అజాతశత్రూ ! శత్రుకులకళంకా ! రేయెల్ల యీభీష్మునికాళ్లుకడుపు పట్టుకొని బతిమాలి వాని ప్రాణాపాయ

రహస్యమును సంగ్రహించిపోయి మాయగాఁ జంపి సిగ్గులేక పైగా శ్రీరంగనీతు లుపదేశించుటకు వచ్చితివా ఛీ! వాహాటా! ఈపాటికి నీచాతుర్యం కట్టిపెట్టుము నీసంగతి మాకు తెలియనిగాదు

దుర్యో—కర్ణా! శాంతింపుము

కర్ణు—శాంతింపకేమి? ఇంక మనమిం దుండఁదగదు

దుర్యో—ప్రాయోపవిష్టుఁడైన తాత నెట్లువిడచి వెళ్లగలము

కర్ణు—నీతాత నీకపకృతిఁ దలఁచువాఁడేగాని నీకుశలమారయువాఁడు గాఁడు ఈపాతాళజలాభిలాషయు మత్స్యయంత్రమువంటి యొకకపటనాటకము వీరందఱు పాండవులను గెలిపించుటకుఁజేయుచున్న స్వార్థత్యాగము నీమేలునేగోరి నిజముగా ఈదేవ్రతుఁడాహవమొనరించిన నింక మనకౌరు లెందుకు? శత్రువుల నెల్లరనీతఁడే కడతేర్చియుండును

దుర్యో—అట్లన నెట్టునొప్పను మాతాత మనకుఁ గృతజ్ఞుఁడు గావుననే మన పక్షమునఁ బోరి వీరశయన మలంకరించినాఁడు

కర్ణు—ఇంకను నీకా వెఱ్ఱి వదలలేదు.

ఉ. తిండికి కౌరవేయుల నుతింపుచునే పడియుంటిగాని యా
పాండవులే మదాప్తులని పాడెను నీదు పితామహుండు భీ
ష్మండు మహాకృతజ్ఞుఁడని జూచెదవేటికి నెట్టకేలకున్
భండనమావహిల్ల రిపుపక్షముజేరె నిఁకేమికావలెన్.

అర్జు—ఎంతవాని నెట్టిదురూక్తు లాడుచున్నారు

సీ. స్వచ్ఛందమరణంబు సాధించె ఘనతప
ఛ్ఛక్తి నిట్లెవరికీ శక్తికలదు
అంబను పెండ్లాడుమను భార్గవుని నాజి
గెలిచె మున్నెవరి కీ బలగముగలదు

జనకునకై సుఖంబును ధాత్రివిడిచె ని
యిల నిట్టు లెవరి కీ చెలిమిగలదు
ఉర్వికెల్ల పితామహుండయి తర్పణం
బులుగొను నెవరికీ విలువగలదు

ఆ గీ శస్త్రశాస్త్రములను సమముగా సమముగానేర్చి యా
చార్యుఁడై కర మనివార్యమైన
వ్రతగరిష్ఠుఁ డితఁడు వసువులనొక్కఁడు
భీష్ముఁడనఁగ లోకపితృఁడుగాఁడె

కర్ణు—కావచ్చును కాని
సీ స్వచ్ఛందమరణంబు సాధించుటేమిటి
చావు వచ్చెడిదాఁక చావరెవరు
అంబను పెండిలియాడ మానుటయేమి
అంబఁబెండిలి యెవ్వరాడగలరు
జనకునకై సుఖంబును వీడుటేమిటి
విడకున్న నాతఁడే వెడలఁగొట్టు
ఉర్వికెల్లఁ బితామహుండన నేమిటి
బిరుదులెన్నిటినైనఁ బెట్టవచ్చు

ఆ గీ శస్త్రశాస్త్రములను సమముగా నేర్చిన
వారు కలరు పెక్కు వారిలోను
కాని శత్రువులకుఁ గల గుట్టు చెప్పియు
హానిసేయువారు గానరారు

(రణదుందిబి మ్రోయును)

కర్ణు—(శ్రవణ మభినయించి) ఏమి?

(తెరపడును.)

రంగము-గుడారము

(అభిమన్యుఁడు ఉత్తర ప్రవేశించియుందురు)

అభి—ఉత్తరా! అజాతశత్రుఁడగు యుధిష్ఠిరుఁడు నేఁడు గురువైన ద్రోణాచార్యునిచే నడపఁబడుచున్న సంగ్రామమునఁ బన్నినపద్మవ్యూహమును భేదించుటకు నన్ను నాయత్తము చేసి నాయనా! "అభిమన్యకుమారా! నేఁడు మావంగడము నిలుపవలయును సుమా" యని వాత్సల్యమునఁ దలదువ్వి పలికినాఁడు నేనిదే నీయొద్దననుజ్ఞనుదీసికొని యుద్ధభూమికిఁ బోవుచున్నాను ఇది మిగుల సుదినము నాతల్లి సుభద్రాగర్భమున నేనున్నప్పుడు మామామ శ్రీకృష్ణుఁడు పద్మవ్యూహప్రవేశాది రణపాండిత్యము నభ్యసింపఁజేసినాఁడు అది నేఁడు ప్రదర్శింపవలసిన యవసరము తటస్థించినది కాంతా! మనకు నేడెంతభాగ్యమో వింటివా?

ఉ. ద్రోణుఁడు కర్ణముఖ్యకురుదోర్బలయోధులు యుద్ధభూమిలోఁ
బాణములన్ ధరించి రణపాండితి జూపెడువేళ వారివి
న్నాణమడంచి నాపితృఋణంబునుదీర్చి హితంబుగూర్తు గీ
ర్వాణలు కీర్తిగీతములు పాడఁగ పార్థివులెల్ల చూడఁగన్

ఉత్త—నాథా! లోకభీకరుండును శస్త్రాస్త్రకళాకోవిదులునగు కురుయోధులంత సులువున నెట్లుజయింప సాధ్యమగును

అభి—ఉత్తరా! సందేహించెదవేలా?

మ. తలపూవాడఁగ నీక చెక్కిటను స్వేదంబైన జాల్వారనీ
కలతాంబులఁ గోయురీతి రిపుసంఘాతంబు నిర్జించి రా
జ్యలతాంగిన్ గొనివత్తు దుందుభులుమ్రోయన్ దివ్యులా వైరికో
టల యూథంబులనెక్కి కీర్తిసతి నాట్యంబాడ నేఁడెంతయున్

ఉత్త—ప్రాణేశ్వరా! నీవన్నది నిజము నీపరాక్రమము త్రిలోకవిదితము కాని

చ పరగుదునంచు నీతులను బల్కెడుదాననుగాను గాని యీ
దురమునకీవుఁ బోవలదు ద్రోహులు కౌరవులన్ జయింప దు
స్తరము సురారికైన రణదాత్రిని గాండివిలేనియట్టి యీ
తరుణమునన్ రణంబు శుభదంబని తోఁచదు ప్రాణవల్లభా !

అభి—కాంతా ! నీకింత చింతయేల ?

ఉ ఆలమరల్చి నాజనకుఁ డర్జునుఁడప్పుడు నీకు శత్రులన్
గూలిచి బొమ్మపొత్తికలకున్ వసనంబులుదెచ్చి యిచ్చె నే
నాలమునందు వారి హతమార్చి పదీయ కిరీటపంక్తి ర
త్నాలను దెచ్చి యిచ్చెదను నచ్చనగాయలు నాడుకొంటకున్.

ఉత్త—అది యేమోగాని మీరు రణంబునకుఁ బోవుటకు నామనం బంగీకరింప లేదు

అభి—అది స్త్రీజనస్వభావము

చ మగఁడు రణాంగణంబునకు మార్తుర గెల్వఁగఁబోయెదంచు నా
త్మగరితతో వచింప ప్రమదంబున నౌనని చెప్పి పంపనే
మగువయు సాహసింప దిదిమార్గము సాధ్వులకెల్ల ప్రాయికం
బుగ నిట వచ్చు చున్న వినఁబోలునె వీరుఁడు నాఁడమాటలన్

ఉ—నాదా ! అటులైన నన్నును నీవెంట యుద్ధమునకుఁ దోడ్కొని వెళ్లుము

అభి—అట్లొనఁగూడదు.

చ వనములఁదోడి నెచ్చెలులు పాటలుపాడఁగ నాడుకొంచు నీ
దినములు బుచ్చినావు రణతీరువు నేరవు బాణతూణముల్
గొని రిపుకోటి కుత్తుకలఁ గోయుటెఱుంగవు పట్టు పట్టినా
వెనుకనువచ్చి చూడఁదగు వేడుకయేమి వచింపు మంగనా !

ఉ—నేనును రిపునికానిర్భేధన మాచరించి నీకుఁ జేఁదోడు వాఁదోడునై యుండెదను

అభి—అది యసంభవము  నీవిట్టి తగని కోరికలు కోరవలదు

ఉత్త—ఏల ?

ఉ  ఆడినమాటెకాని యెదురాడఁగ నీయవు కోటిచెప్పినన్
వీడవు నీమతంబు గురువీరులు క్రూరులు వారి నోర్చగాఁ
గూడునే నీకు నీరణము గూడదు నామన వాలకించు న
న్నాఁడ దటంచుఁ దిట్టి తెగనాఁడకు రమ్ము శుభంబు నీకగున్

అభి—(చేయి పట్టుకొని) కాంతా ! నీ వెంత బేలవు చతుస్సముద్రముద్రిత దరా వలయమునంగల మహావీరాదివీరులు వచ్చి సమరసముత్సాహులై యున్న నీసమయమున వెన్నిచ్చి పాఱిపొమ్మను చున్నావా ? బాలు

ఉ  క్షత్రియుఁడై జనించిననె చాలదు యుద్ధమునందు శూరుఁడై
శాత్రువులన్ జయించి నిజశౌర్యము లోకముమెచ్చఁ బోరుటె
క్షాత్రముగాన నేనుజని కౌరవకోటిని నుక్కడించి మా
గోత్రమునిల్పుదున్ బ్రజలు గోవులు బ్రాహ్మణులున్ సుఖింపఁగన్

ఉత్త—మీరెన్ని చెప్పినను నేనీయుద్ధమునకు మిమ్ముఁ బొమ్మని చెప్పనోపను నాకేమో నేఁడన్నియు దుశ్శకునము లగుచున్నవి

అభి—అవియెట్లు సంఘటించును శకునములు దేవతల చేతులలో నుండును ముక్కోటిదేవతలు మనకు విజయము చేకూరునని దుందుభులు మ్రోయించుచున్నారు ఇంకనీవు దుర్నిమిత్తములేల శంకించవలెను ?

ఉత్త—నేనును నీవెంట వచ్చెదను

ఉ  ఎందఱు సుందరాంగు లనికేగరు వైరులగెల్చి ధాత్రి మె
ప్పందఱు సత్యభామ నరకాసురునిన్ మొనమొన్నఁ గూల్చెనే

నెందుకు ధార్తరాష్ట్రుల జయింపనొ చూచెద నేఁడు నీవు నీ
స్యందనమెక్క నేను రథసారథనై వెనువెంట వచ్చెదన్

అభి—(కౌగిలించుకొని) భర్తృదారికా! నీప్రసన్నహృదయమున కవనత వదనుఁడనై యభినందించుచున్నాను అదే రణనిస్వానము మ్రోయుచున్నది నాకై యెల్లవారుసమరోత్సుకులై నిరీక్షించుచుందురు (అనినిష్క్రమించును)

ఉత్త—నేనును నీవెన్నంటియే వచ్చుచున్నాను అకటా! శరవేగమునఁ బోవు నిన్ను నేనెట్లు కలిసికోఁగలను? నేనింక హతాశనుగదా! హతాశలు ప్రాణములు వాయుదురందురే నేనేల వీడలేదు

తే గీ మెఱుపువలె నాదు విభుని సుందరముఖాబ్జ
మని యినెడు కారుమేఘాల నంతరించె
నాదుహృదయంబు దగ్ధమై వేదన విష
వారి గురియుచున్నది నేను బ్రతుకనింక

ఉ ఈయెలజవ్వనంబు నెటులీడ్తును నొంటిగ దుఃఖభాజనం
బై యెసలారు నాబ్రతుకునం దిఁక సౌఖ్యము లేదు లేదు నా
ప్రాయము వ్యర్ధ మీకలిమి వ్యర్థము ప్రాణవిభుండులేని నా
గేయము రుద్రభూమిఁక ముగించెద జీవితనాటకాంకమున్

సీ ఎవరు నాహితము నర్థింతురు నేను నె
వ్వరి హితంబెనసి జీవనము సేతు
ఎవరు నన్నింక మెప్పింతురు నేను నె
వ్వరిని మెప్పింప కాపురముసేతు
ఎవరు నాయెలప్రాయ మీక్షింతు రెవని ప్రా
యముఁజూచి నేను నెయ్యంబు సేతు

ఎవరు నాముబ్బుచ్చట లీడేర్తు రెవరి ము
చ్చటఁదీర్ప నేను నిచ్చకముసేతు

తే గీ ఎవరితోడివా లోకంబు నెవరు విభుఁడొ
అతఁడె లేకున్న నేనెట్లు బ్రతుకగలను
భూమి నూడఁదీసిన చెట్టుబోలెనేల
వ్రాలి వసివాడి దుఃఖాల గూలిపోదు

సీ ఈప్రాణముల నిల్ప నేది నావిభు వచ
శ్శృంగారరససుధా సేవనంబు
ఈప్రాయమునుబెంప నేది నావిభు దృగం
చల చలన్మధుపూరకలశ చయము
ఈకాలమును బుచ్చ నేది నావిభు నవ్వు
నెమ్మోము పొగసువెన్నెల వెలుంగు
ఈవైభవముజూడ నేది నావిభుపదం
బులమ్రోయు గజ్జెలందెల రవంబు

తే గీ లేదు నేనింక జీవింపలేను నాదు
కట్టె కొనిపోయి నానాధుకడను బెట్టుఁ
డతని వీక్షించి ప్రేమాగ్నియందు కాలి
కరఁగిపోయెద నావాధుకొఱకు నేడ్చి

(తెరపడును)



# మహాభారతకౌరవరంగము

## షష్ఠాంకము

రంగము -యుద్ధభూమి

(బలరాముఁడు శ్రీకృష్ణుఁడు ప్రవేశింతురు )

బల—

ఉ. ఈయెడఁ బాండుపుత్త్రులు ననేకవిధాల యధర్మయుద్ధముల్
జేయుచునుండి రెంతయును జేట్పడి కౌరవులెల్ల రీల్గి ర
య్యో యిది యేమిన్యాయ మిటులూరక చూడఁగజెల్లునే పప
ప్రాయులు పాండవాధములఁ బట్టి వధించెద యుద్ధమార్చెదన్

కృష్ణ—అన్నా ! బలభద్రా ! ఆగుమాగుము

బల—నేనాగను

సీ ప్రళయ కాలానలజ్వాలలేతెంచి బ్ర
హ్మాండభాండము కాల్చుచుండనిమ్ము
రోదసీ కుహరముల్ మ్రోయనశనిపాత
ములచేత ధరఁ గ్రుంగిపోవనిమ్ము
ఉల్కలురాలి విశ్వోర్వీతలము తూట్లు
తూట్లుగాపడివారిఁ దొరఁగనిమ్ము
పుష్కలావర్తయంబుదరాశి కురిసిజ
లార్ణవంబవని చల్లార్చనిమ్ము
తే గీ కడలు నొక్కటై బిమ్మచీఁకటులు క్రమ్మి
మన్ను మిన్నీరు భేదముల్ మాయనిమ్ము

కాని యెన్నటికిని ధర్మహాని కింత
చోటు నిడరాద ధర్మంబు చూడరాదు

కృష్ణ—ఇప్పుడు సంఘటించిన ధర్మహానియేమి?

బల—ఈకురుక్షేత్రము దర్మమునకు నెలవైనది ఇందదర్మవర్తనులగు పాండు నందనులు విచ్చలవిడిగా రణనీతి నతిక్రమించి మదగజేంద్రము కదళీ వనమును జీల్చి చండాడినట్లు కౌరవకాంతారమును బాణానలమున కాహుతిచేసి వేసినారు అక్కటకటా! ఎంతఘోర మెంత దారుణము కృష్ణా! నీవెఱుంగవా!

సీ. ప్రాణ రహస్యంబు లడిగి శిఖండి న
డ్డుంచి భీష్మునిసంహరించినారు
వచ్చినాడనుచు నశ్వద్ధామపై మృషో
క్తుల నాడి ద్రోణునిఁ గూల్చినారు
రణభూమి దూరిన రదమును సవరించు
కొనుచుండఁ గర్ణుని గొట్టినారు
దుస్ససేనుని తలఁదూల్చి గర్భము జించి
రక్తంబు జేరలఁ ద్రావినారు

గీ సైంధవునిఁగూల్చి రల పద్మ బాంధవునకు
నడ్డుగాఁ జక్రముంచి నీ వడ్డుపడితి
వకట సమరంబు సేయనం బాడి తప్పి
వాఁడవిఁక నేమి ధర్మమున్నది మురారి

కృష్ణ—(స్వ)ఓహొ! ఈతఁడు నిజముగా అలిగి యాలమునకు దిగినబ్రహ్మాండ ములు తల్లక్రిందులై పోవును దేవేంద్రాదిదిక్పతులకుఁగూడ నజేయుఁడు. ఈభారతమహాకదనకథావిధానమే మాఱిపోవును కావున నెటులనైన బుజ్జగించి వెనుకకు సాగనంపెదనుగాక వెనుక నర్జునుఁడు సుభద్ర

నెత్తికొని పోయినప్పు డిట్లే దురాగ్రహ విదగ్ధుఁడై మంచిపడి పరువులెత్తి కభీకరుఁలోడై పాండులోక సంహారసంక్షుభిత సంరంబమున నాక్రోశించుచు వచ్చినాఁడు అప్పుడెట్లోయను నయోక్తులనాడి శాంత చిత్తునిగావించి పంపించితిని (ప్రకాశముగ) అన్నా! నీవన్నది నిజమే కాలకర్మవశమున గతించెడువారికై మనమడ్డుదూరఁజాలము దర్మా దర్మములు అవస్థాబద్ధములు ప్రాయికములు బలి దాతయైనను రాక్షసుఁ డగుటచేఁబాతాళమునకుఁ ద్రొక్కక తీరినదిగాదు ఇంచు నీవెఱుంగని యర్థమేమున్నది నీవు సర్వజ్ఞుఁడవు

బల—ఆది దేవతావిషయము దీనికి ఒలి చరిత ముదాహరణము గానేరదు నీవు సందికై రాయబారివై పోయి యీపోరు దెచ్చిపెట్టితివి

కృష్ణ—లేదు కౌరవులు నన్నే పరాభవించినారు

బల—నీవు చక్రమును సంచెంచనని చెప్పి సైందవవదా సందర్భమున భీష్మనిపై యలిగి యెదుర్కొనునాఁడు ఇంక నెన్నియోసారులేల నీచక్రమును ప్రయోగించినాఁడవు యిది సమయాతిక్రమణముగాదా! పాఱిపోవుటకు సిద్ధమైన యర్జుననిమవ్వి పోరుసాగించితివి దాన భారతకులార్ణమే యింకిపోయినది

కృష్ణ—అగుననుకొనుము ఆప్తుని రక్షించుటకుఁ బ్రాణమైనదారవోయవలయును నన్ను నమ్మిన పాండవుల నెటులైన గెలిపించవలయును అది ధర్మము కానిమ్ము నదర్మము కానిమ్ము

తే గీ ఆప్తునార్తుని దీనుని యతిని సతిని
శరణువేడిన వాని నోగిరముకొఱకు
వచ్చి నాతనిఁ దల నేల వ్రాల్చి మ్రొక్కు
వానిఁ గాచుట ధర్మమెవ్వానికైన

బల—అధర్మము కన్నులార జూచుచు నూరకొన్న నాపాపము మనముగూడ పంచుకొనవలసివచ్చునుగాదా?

కృష్ణ—పాపము తపస్సువలనఁ బోవును

తే గీ కార్తవీర్యార్జునుండు భార్గవునియెడల
తప్పుజేసిన నతఁడు క్షాత్రమును సంహ
రించి యీకురుక్షేత్ర ధాత్రిని తపంబు
జేసి పాపంబు యార్జించె వాసి గనఁడె

బల—అక్కటకటా! భీష్మద్రోణాదిమహావీరాధివీరులు వీరశయనమలంకరించి నారు కర్ణుఁ డీల్గినాఁడు శల్యుఁడు దర్మజునిబాణికిగురియై మడసినాఁడు దుశ్శాసనాదివికర్ణులంద రంతరించివిరి ఏకాదశాక్షౌహిణీపరిమితంబైన మహాసేనయంతయు రూపుమాసిపోయినది పేరున కొక్కఁడైన నగపడఁడు దుర్యోధనుఁడొక్కడే యీదుఃఖమును జూచుటకు మిగిలి యున్నాఁడు ఆతఁడైనను మిగులునని తోఁచదు

కృష్ణ—నిజము దురాత్ములు తప్పక నశింపవలసినదే

బల—ఎవరు దురాత్ములు!

కృష్ణ—కౌరవులు

బల—ఏమీ? (అని పళ్లుకొరుకొను)

కృష్ణ—ఏమా!

ఉ మాయలుపన్ని ఓన్ని యభిమన్యుని జంపిననాఁడు నీవు మై
రేయము ద్రావి మైకమున రేవతితో నిదురించుచుంటి వి
స్సీ యదెఉత్తరార్తిఁ గృశియించుచు నేడ్చుచు చావనున్నదా
ప్రాయపులేమ నూరడిల బల్కుము ధర్మము నీకెబోధగున్

బల—(వేళ్లు కఱచి) అహో! పాప మాఉత్తర సుభద్రాద్వితీయయై యీవంకకే

వచ్చుచున్నది అన్నా! దుర్యోధనుని పట్టుదలయెంతకుఁదెచ్చినది?

(తెరపడును)

రంగము - ద్వైపాయన హ్రదము

(హ్రదసమీపమున దుర్యోధనుఁడు ప్రవేశించి)

దుర్యో—హా! హతోస్మి హతోస్మి నేనింక సంపూర్ణహతాశుఁడను గదా! ఓఆకాశమా! నాపైవిరిగి పడిపోవవేమి? ఓమృత్యుదేవతా! నాప్రాణవాయువు లాచికొనిపోవవేమి? ఓదేవతలారా! నాపై నిప్పులు రాల్చరేమి? ఓఅగ్ని! నానిలువెల్లఁ గాల్చి నీగర్భమునఁ బెట్టుకొనవలెను ఓభూదేవత! నీవు బద్దలగుము నేను దూరిపచ్చి నీలోఁబ్రవేశించెదను ఓదిక్కులారా! నాపైఁ బడుఁడు ఓసూర్యచంద్రులారా! మీరునన్నుఁ జూచుటకు అసహ్యించుకొనుచున్నారా? అయ్యో! నాకింక యేది శరణ్యము ఏదిగత్యంతరము ఏదిదిక్కు నాకు పగలులేదు భూమిలేదు దిక్కులులేవు సమస్తముఅంధకారమై పోయినది చతుస్సముద్రముద్రితమైన యీదరాచక్రము నాచేతినుండి జారిపోయినది నాసేనానులు తెగినారు చతురంగ బలసమేతమైన నాబలమంతయు క్షీణించిపోయినది పేరున కొక్కఁడైన మిగులలేదు సోదరులెల్లరు ప్రేతభూమికి బలియై పోయినారు సుతుఁడు లక్ష్మణుఁడు స్వర్గ మలంకరించినాఁడు నారులా అగ్నిప్రవేశించిరి ప్రాణమునకన్న పరమాప్తుఁడైన కర్ణుఁడు కూలినాఁడు ద్రోణాచార్యుఁడు మోసముచేసి రణవసుంధరకు ప్రాణముల నర్పించినాఁడు ఏఁడీ! అదుశ్శాసనుఁడు ఏఁడీ! అమామ శకుని ఏఁడీ! అవికర్ణుఁడు అక్కటా! అందరును యుద్ధమున మడిసినారు మాయాయుద్ధమునకు లొంగిపోయినారు. నాకింకెవ

దున్నారు నాకు చుట్టము లెవరు? ఎవరు నాయనువారు హా! హతవిధి! పాపపుదైవమా! నీవున్నావా! లేవు లేవు నీవు లేవు ముమ్మాటికిని నీవు లేవు నీవే నిజముగానున్న మాకిట్టి సంప మరణము దెచ్చిపెట్టవు మమ్ము పంచభూతముల కాహుతిచేసి భస్మీపటలము చేసివేయవు నీవు లేవు కావుననే అన్యాయము నెగ్గినది న్యాయము నాశనమైనది ఎప్పుడును న్యాయమునకు జయములేదు. మాయావాది కుహనాసంస్కర్త అనృతపరాయ ణుఁడు దుష్టుఁడు ధర్మజునకే ప్రకృతితోడై సముత్సాహయై గెలుపు గలిగించినది అయ్యో! నాయాపాదమస్తకము దహించు కొనిపోవుచున్నదే నానిలువెల్ల నీరై పోవుచున్నదే నాతనువెల్ల దారువై భరమై పర్వతమై పగులనిపాషాణమై మాఱిపోయినది అదే లవమై యెగిరిపోవుచున్నది అన్నా! అన్నా! యెందు పోవు దును ఎందు దూరిదును ఏది గుహ ఏది దారి ఏది చోటు ఏది భూమి బద్దలు కాదేమి ఈగాలి నన్నెత్తుకొని పోవదేమి ఈయమదేవతలు నాయూపిరిని పీల్చివేయు రేమి నేనెంత మొం డిని ఎంత దుండగీడను ఎంత కఠినుఁడను ఎంత లజ్జాహీనుఁ డను ఎంత పాపిని నావ్రతము పటాపంచలైనది నేను పెద్దల మాట విననైతిని పెద్దల యాశీర్వాదములు గొననైతిని పెద్ద పోరు దెచ్చిపెట్టుకొంటిని పుత్రమిత్రకళత్రములతోఁ గూడిన నాదుర్యోధన సంతతి పేరునకైన లేకుండ అదురాత్ముఁడు క్రూరుఁడు రాక్షసాధముఁడు భీముఁడు అన్నా! ఆపాపి పేరేల నుచ్చరించితిని ఆతెండిపోతు తిన పొట్టను పెట్టుకొన్నాఁడు నా కాలమే మాఱిపోయినది నా యదృష్టమే తిరిగిపోయినది నే నింక యెటుల నిలువఁగలను నన్నేది భరించగలదు ఎవరు

రానిత్తురు? ఎవరికి నాపైజాలి పుట్టును ఎవరింక నన్నోదార్చు వారు? ఓమృత్యుదేవత! ఓనిరాశాదేవతా! నీవే నా చెలిమి చుట్టమవు నీవె నాకు తోడునీడవై మార్గము జూపుము ఏది హ్రదము ఏది నా గమ్యస్థలము నాకింక తెరవులేదా! నాకు దాత లేడా! భగవంతుడు లేడా! ఏది కృపాణము ఏదిగద ఏది బాణతూణీరములు హా! పాండవహతకులు పాండుపుత్రులు అదిగో దురాత్ములు వచ్చుచున్నారు అదిగో నాశిరము నరికి వేయుచున్నారు అదుగో నాపై పడినారు హతోస్మి. హతోస్మి ఓ ముక్కోటి దేవతలారా! మీరు రండు నేనిక అపాండవము సేయలేను నా ప్రతిజ్ఞ భగ్నమైనది ఏది నాకాణాచి ఏది హ్రదము అదిగో అదిగో అందులో గూలిపోయెదను అందులో దాగుండెదను అపాండవముకాలేదు శత్రునిశ్శేషము కాలేదు. అదిగో పాండవులు అదిగో భూతపంచకము నేనిదే పాఱిపోయెదను నే నిదే దిశలకు ఎలుగెత్తి యేడ్చెదను మిన్నంటి ప్రాకెదను గాలిలో లీనమై భూమిలోపాతుకొని అగ్నిలో ఆహుతియై నీటిలోదేలి అప్పుడైన అపాండవము చేసెదను పాండవ లీలోకమున నుండరాదు పాండవులపేరు మాసిపో వలెను పాండుపత్ని ఆపాడుముండ ఆయాడది ఆపాంచాలి ఆబంధకి ఆమహాపాపిని కలుషదూషిత ఆతీతువుపక్షి దురాత్మురాలు అది చావవలయును అది హతాశురాలు కావలెను. దాని గర్భము వేయిప్రక్కలు కావలెను అది లోకమున నుండరాదు. దానిపేరు ప్రేతదేవతలో చేర్చవలయును అదియే యింత కుష్మురము దెచ్చినది అదియే కొంపలు కూల్చివేసినది ఆకులటయే యీ భారతవంశమును కళంకమును నాశనమును దెచ్చిపెట్టినది.

అయ్యో ! నాసేనానులు కృతఘ్నులై పోయినారు నాయన్నము దిని నాపైఁబగసాధించినారు ఆగురువు ద్రోణాచారి అశ్వత్థామా పోయెనని ఆమృషావాది దర్మజునిమాటలు విని అస్త్రసన్యాసము గావించి దృష్టద్యుమునిచే తల నరుకఁబడినాఁడు కర్ణునిశల్యుఁడు నిరుత్సాహవంతునిజేసి కడతేర్చినాఁడు దుశ్శాసనుని అధర్మయుద్ధమున దుస్ససేనుని వికర్ణుని మాయఁజేసి పాండవపశువులు వదించినారు నాయరణ్యరోదన మింక వినువా రెవ్వరు? ఎవరికి నా ఆర్తనాదము హృదయనిర్భేదకము గావించును హా ! తల్లీ ! గాంధారీ ! సత్య పతివ్రతా ! నీవు కన్నకొడుకుల కెంత యాగడము పట్టినదమ్మా ! ఏనోముల నోచితివో ఏవ్రతములు పట్టితివో ఒక్కఁడైన లేకుండ కడతేరిరి గదా ! ఇంక నేనొక్కఁడనున్నాఁడను అదియైన కొన్ని గడియల వాఱకే ఓప్రకృతీ ! ఓకాలస్వరూపినీ ! నీమహిమ అనుల్లంఘ నీయము అప్రతిహతము అదిగో ! భూతభేతాళములు ఖరకర కరాళదంష్ట్రములుపైకిఁదీసి పీనుపెంటలపైఁబడి చెరలాడుచున్నవి రక్తము ద్రావుచున్నవి ఎంతచిత్రము ఎంత భీభత్సము ఈచిత్ర నాటక మీపాడు కన్నుల కగుపర్చితివి తల్లీ ! నీకిదే వందనములు. వందనములు

(అని హ్రదమునఁబడి సగము మున్గి)

మ జలమధ్యంబునకేగి యీహ్రదమునన్ స్తంభించి సంత్రాస ని
హ్వాల చిత్తంబు ప్రశాంతయత్తమగు పర్యంతంబుగూర్చుండి ఆ
ఖలు లా పాండవులెల్ల గూలిరను వాక్యం బర్థినాలించి యే
వెలికిన్ వచ్చెద లేనిచో నిదియె నావిశ్రాంతి సౌధంబగున్
అహా ! దందహ్యమాన మానసుఁడ నగు నాకీ యాశాంకుర ముద

యింపటకేమి యవకాశము ఏమియవధి యెక్కడిచోటుఁ నాహృదయ పీఠికయం దెచ్చటనైన నార్ద్రలేశ మున్నదా! లేదు-లేదు ఒక్కఁడు కలఁడు-లేడు వానిపేరెత్తను అతఁడును కృతఘ్నుఁడే, అయిన నాదీనా వస్థ కృతఘ్నులకుఁగూడ జాలి పుట్టింపదా! పుట్టించును అపాండవము చేయుటకు అశ్వాద్ధామకలఁడు ఆతనికీశ్వరుఁడు తోడగునుగాక ఆతఁ డీశ్వరాంశ సంభూతుఁడు ఇంకనేనెందుకు? ఈహ్రదమునఁ దలదాఁచు కొనియెదను నాయాశాంకురమున కీనీరములు పోసిపెంచెదను తల్లీ గంగా నాకొకింత నీకడుపులోఁ జోటొసంగుము నాస్థితిపైయొకింత కరుణింపుము నీలోదాఁగి విశ్రాంతి నొందెదను కాని యాపాండవహతకు లిచ్చటకుఁ గూడ వచ్చెదరేమో హా! (అని సరస్సులోఁ బడిపోవు)

(శ్రీకృష్ణుఁడు పంచపాండవులు బ్రవేశించెదరు)

ధర్మ—కురుపతి యీదారినే పాఱిపోయినట్లు తోఁచుచున్నది

కృష్ణ—అగు నట్లేయున్నది

దర్మ—

చ తులువతనంబు వీడ కల దుష్టచతుష్టయమందుగూడి యీ
కలహము దెచ్చిపెట్టి కురుకాననమెల్ల దహింపవేసి యా
ఖలుఁడు సుయోధనుండు కలకాలము భూమికిఁ బుస్తెఁగట్టి న
ట్టులఁ దలపోసెఁగాని యెపుడున్ దలపోసెనె యీవినాశమున్

భీము—ఏఁడీ! అమర్మార్గుఁడు ఏఁడీ! ఆదుర్యోధనుఁడు పాఱుబోతా! యెందే గెదవు? రా పోరుటకురా

ఉ నూర్గురు తమ్ములన్ సుతు లనూనబలంబుల నాజిలోపలన్
భర్గున కాహుతిఁ సలిపి ప్రాణభయంబున పాఱిపోయె దు

ర్మార్గుఁడనొ సుయోధనుఁడు రాచకులంబున కెగ్గు నింటికిన్
దుర్గతితెచ్చినాఁడు తుదిద్రోహి హతాశుఁడుగాఁడె యారయన్

భీము—ఏమీ, కౌరవపతి పాఱిపోయినాఁడా! భూమివిడిచి పోలేఁడుగదా?

ఉ. ఆహవభూమినిన్ విడిచి ప్రాణభయంబున పాఱిపోయినన్
బోవఁగనిచ్చునే కురుపు మున్నొనరించిన పాపకర్మ నా
నావిధ దుఃఖభాజనమునన్ విలపింపక, యీయదార్థ మే
దో విధిరూపమై నడపుచున్నది లేనిచొ సృష్టియాగునే

నకుల—అగునది నిక్కము

సహ—ఏఁడీ? అసుర్యోధనుఁడు

కృష్ణ—దుర్యోధనుఁ డీదారినే వచ్చియుండును

ధర్మ—అది యెట్లు చెప్పఁగలము

(చారులు ప్రవేశించి)

దేవా! కురుపతి యెచ్చట కేగెనోకాని దశదిశలకును పోయి
మెట్టి వెదకి వేసారి వచ్చితిమి కాని వానిజాడ లెచ్చటనుగూడ
గానరాలేదు తుదకు హతాశులమైవచ్చివేసితిమి

ధర్మ—సరే పోనిండు

భీము—వాఁ డీదారినే పాఱిపోయి యుండును

కృష్ణ—అర్జునా! యీహ్రదమును పరీక్షింపుము

అర్జు—ఏటికి?

కృష్ణ—దుర్యోధనుఁ డిందే యుండునని తోఁచుచున్నది

అర్జు—అది యెట్లు సంభవించును

కృష్ణ—వానికి జలస్తంభనవిద్య చేతనగును యుద్ధమున నోడిపోయి తుదకొంటి
ప్రాణితో నీజలాగారమునఁ బ్రవేశించి యున్నాఁడు

అర్జు—ఏటికి.

కృష్ణ—వానికొక ప్రతినగలదు

అర్జు—అదియేమి ?

కృష్ణ—అపాండవము చేసివేయుదు నని ప్రతిజ్ఞ పట్టినాఁడు తుద కాతఁడేనశించి పోయినాఁడు తుదకు నిరాశుఁడై యీహ్రదమున దాఁగొనినట్టు నాకుఁ దోఁచుచున్నది

అరు—ఈహ్రదమనే నిశ్చయమేమిటి? ఈకురుక్షేత్రమున పరశరామునిచే శమంతపంచక మనదగునైదుమడుగు లున్నవి అందేమడుగులో నాతఁడు దాఁగినాఁడో యెట్లు చెప్పగలము

కృష్ణ—అదియా !

తే గీ ఉరుమహారాజ లక్షణయుతములైన
అడుగుజాడలు కురుపతిహ్రదమునందు
జొచ్చినట్టుల జూపింపఁజొచ్చె నదిగొ
ధూమ మగ్నిని జూపించుతోయ మరయ

అర్జు—అగు నది నిజము సుయోధనుఁడిందే యుండుట తథ్యము

ఉ కాటుకవాటె యీజలము గల్మషచిత్తుని నిన్నుడాఁచి నీ
వేటికి నీటడాఁగెదవు హీనునిఁబోలె రణంబుమాని నీ
బోటి మహారథుండు వెలివోయిన వీరులు నీదు మోముపై
కాటుకవెట్టరే పిలిచి కౌరవనాద ! సుయోధనాధమా

భీము—ఓరీ కులద్రోహీ ! హీనా ! దుర్యోధనా ! రా పైకిరా సిరికిపందవై యేల నీటిలోమునిఁగి మొగము చాటువేసికొనెదవు

చ జలమునఁ డాఁగినన్ గిరులచాటున కేగిన భూమి దూరినన్
ఖలు నిను బోవఁగా విడిచి కౌరవలోకము సంహరింపఁగాఁ
దలఁచుటలేదు నిన్నిఁక గదాహతి వ్రయ్యలుజేసి భూమికిన్
బలి యొసఁగన్ దలంచితిమి పైటకురమ్ము సుయోధనాదిపా

కృష్ణ—దుర్యోధనా ! పైకిరమ్ము భీరునివలె ఏలఁ డాగెదవు వచ్చి వీరునివోలెఁ
బోరివీరశయన మలంకరింపు మది యుభయలోకతారకమైనపని

ధర్మ—దుర్యోధనా ! పాఱిపోవునట్టి యిట్టి పిరికిపందతనము గలవాఁడవేటికి
కలహాము దెచ్చిపెట్టితివి

నకుల—పాపబిత్తునకు పౌరుష మెక్కడుండును?

సహ—సాహస ముండును

క సీతను హరించి రావణుఁ
డేతీరున తగుదు ననుచు నేగెనొ నని కై
ఆతీరున కౌరవపతి
మాతో కయ్యంబు పెంచిమానెను గంటే
(దుర్యోధనుఁడు హ్రదమునుండి పైకి వచ్చి)

దుర్యో—

శా ఓరోరీ ! కులపాంసులార ! రణమద్యోర్విన్ మహోద్యోహులై
ప్రారంభించి యధర్మయుద్ధముల మాయన్ జేసి మావంశ కాం
తారంబంతయు కాల్చివేసిరి జలార్థంబేను రా వచ్చి యీ
కారుల్ ప్రేలఁగఁ బాడియే కురుపతిన్గా నన్ను నర్దించియున్

అర్జు—ఏమి? నీవు జలార్థము వచ్చితివా? ఎంత నంగనాచివి

దుర్యో—ఇం దబద్ధ మేమున్నది నావిజయమునకై వచ్చి యీజలదేవత
నుపాశించుచు స్థంభించి యిందు కూర్చుంటి. ఇచటకు మీరేల
రావలయును

ధర్మ—పాఱిపోయిన వానిని వెదకి పట్టుకొనుటకై వచ్చితిమి

దుర్యో—ఏల యీయనుచితము లాడెదరు? నేను పాఱిపోయితినిగా ! పాఱిపోవుట
కీయర్జునుఁడు ప్రయత్నించెను గాని నేనుగాదు. నాబలమింకను మీతోఁ
బోరాడుచునే యున్నది.

సరే నేను పాఱిపోయితినే యనుకొనుఁడు రణభీరువునే యనుకొనుఁడు అట్టివానివెన్నాఁడి వచ్చుటకు దర్మవిదులైన పెద్దలియ్యకొందురా! మీరు నీచాతినీచులు గావున ఈయన్యాయమునకు వడంబడితిరి

తే. గీ ఇంక కలరు నశ్వత్థామ కృపుఁడు నేను
అని హరించి యపాండన మాచరింప
మిడిసి పడబోకుఁ డావహ మడఁగె ననుచు
చాలగలవు ముసళ్లముచ్చటలు ముందు

భీము—ఏమి నేపేరాస! ఇంకను నీయాశాకుసుమము నీకావహిల్లిన దుఃఖానిలముచే రాలకింకను నెంతగ జీరాడుచున్నది ఓరీ! మూర్ఖుఁడా! నీకింకేమి జయము ఇంకను చావక బ్రతికియున్నాఁడవు

ఉ నూర్గురఁ మిమ్ముఁ జంపుటకు నోచెను ఈగద నిన్ను వీడునే
భర్గుఁడువచ్చి పోరిన ప్రభాకరుఁ డడ్డిన, నీవు భీతిమై
నిర్గమనంబుఁ జేసినను నీటమునింగిన నింగిడాఁగినన్
దుర్గతినుండి తప్పుకొన దుర్లభమో కురువంశనాశనా!

దుర్యో—ఓరీ! ఏల వృథగా దురూక్తుల నాఁడెదవు

ధర్మ—అతని నీవు వారింప వీలులేదు

దుర్యో—ఓరీ! దర్మజా! నీవెంత కఠినాత్ముఁడవు ఇది నీవనవలసిన సంగతియేనా? గత మంతయు మరచితివా?

ధర్మ—లేదు ఎట్లు మరతును మరతుమన్నను మరుపురావలదా? లోపలి యంతఃకరణచతుష్టయము భగ్గున మండిపోవుచున్నది

దుర్యో—అది నీవు నిజముగా గుండెలపై చెయ్యివైచికొని చెప్పు సంగతియేనా?

కృష్ణు—ఏమి దుర్యోధనా! ధర్మరాజుచేత ప్రమాణములు చేయించుచున్నావు. నీస్వగౌరవమున కది హానిగాదా?

దుర్యో—(పండ్లుకొరుకి) అగును హానియే పాండవులారా! ఓధర్మనందనా! అజాతశత్రూ! ఓశత్రూ!

సీ నాతండ్రి దృతరాష్ట్రు డే తండ్రిగామిమ్ము
పెంచిన మేము వారించలేదు
యువరాజు నేనుండ యువరాజ పట్టంబు
నిడ మీకు వలదని నుడువలేదు
రారాజు నేనుండ రాజసూయముమీర
లాచరించినను మే మలుగలేదు
శకునితో జూద పాచికలాడి రాజ్యమో
డిన మీకె యది యియ్యఁ గినియలేదు

తే గీ కుడిచి కూర్చుండలేక యీ కుమ్మరంబు
దెచ్చితివి మమ్ము తిరిగి పందెమున దింపి
రమణితో రాజ్యమోడి యీరవ్వపాలు
సేయ నేటికి ధర్మజా! చెప్పవయ్య

ధర్మ—అదియంతయు నీవుచేసిన కపటనాటకము ఆపాచికలు కేవలముమాయా భరితములు, మోసయుతములైనవి

దుర్యో—అదియేగదా నీవాదము పాచికలు మోసమైనవి కానియెడలనింక మెమొనరించిన యపకృతి యేమున్నది పాచికలు నిర్జివమైనవి అవి స్వతంత్రించి మోసముగాని మేలుగాని వేయఁజాలవు ప్రపంచమున నెందఱో దర్మజ్ఞులున్నారు వారి నడిగిపాచికలలోని మోసమువ్య క్తీకరింపనేర్చెదవా! నీవు గొప్పజూదరివని లోకమునఁ బ్రఖ్యాతినిగాంచిన మేటి కితవుఁడవు మాయాపాచికలనియేగాని ఆమాయ ఎట్టిదో ప్రతిపాదించఁగలవా! లేని యెడల జూదమెప్పుడును ఏదో గెలుపులతోఁ గూడినది

ప్రపంచములో నోడిపోయిన ప్రతివారును పాచికల నెపముగాఁదగువు లాడుచుందురా ! సరే నీవు మొదట రాజ్య సర్వస్వమోడిపోయితివి అయినను కురుకుల పితామహులెల్లరు మీరాజ్యసర్వస్వము మీకే యిప్పించినారు అదిగొని నీవు హాయిగా కాలక్షేపము సేయక తిరిగిమమ్మేల జూదమునకుఁ బిలిచినావు పిలిచినవాఁడవు సుదతితోసహా రాజ్యమేల ఓడితివి? ఓడినవెనుక ఆయాస్తిపై నీకేమి యధికారమున్నది?

సహ—పదమూఁడేఁడులైనవెనుక మారాజ్యము మాకు నీవివ్వెదవనలేదా?

దుర్యో—అగును మీరజ్ఞాతవాసము యథావిధిగ నిర్వర్తింపక సమయభంగము గావించి గోగ్రహణమునఁ బయల్పడినారు

ధర్మ—మాగడు వప్పటికి నిండినది

దుర్యో—లేదు

కృష్ణ—ఈవివాదము భీష్మఁడే పరిష్కరించినాఁడుగదా !

దుర్యో—పరిష్కరించలేదు సమర్థించినాఁడు

అర్జు—అధికమాసములుకలిపి పదమూఁడేడులు కాలేదా?

దుర్యో—లేదు తిథిద్వయములు అధికమాసములు సంవత్సరాంతర్గతములే అది గాక కడాపటిదగు నజ్ఞాతవాసవత్సరము పదిరెండు మాసములు మీరొరుల కగపడకుండ ప్రచ్ఛన్నులై యుండవలయును అట్లుజరుగలేదు గావున మీరు శపథానుసారము మఱి పదమూఁడేడులు తిరిగి రావలసియున్నది

కృష్ణ—దుర్యోధనా ! యేల యీయనగత్యమైన దుర్వాదము ముందు కర్తవ్య మూహింపుము

దుర్యో—ఇంకేమికర్తవ్యము దర్మభీతియున్నగదా ! యేది చెప్పుటకును అదిలేక పోయినప్పు డన్నియు దుర్వాదములే.

కృష్ణ—ఇందెవరికి ధర్మభీతి లేదో నీవే యెఱుంగుదువు

దుర్యో—కావుననే చెప్పుచుంటిని

కృష్ణ—ఏమి చెప్పెదవు

దుర్యో—

క. మును నలుఁడు పుష్కరునిచేఁ
దన రాజ్యమునోడి తిరిగి తానై జూదం
బున గెల్చినటుల మము మీ
రును గెల్వుఁడు నదియె ధర్మరూపము కృష్ణా

కృష్ణ—ఇంక నీకెంత పేరాస యున్నది తిరిగి జూదమాడుటకు యమసదనము నకు నేగిన నీమామ శకునిని నీవేగి వేఁగిరము తోడ్కొనిరమ్ము

భీము—ఆతఁడు వచ్చునప్పు డామాయాపాచికలు మఱచిపోవునేమో జ్ఞాపకము సేయుము

అర్జు—ఆతఁడు మఱచినను పాండవులు మఱువరని చెప్పుము

దుర్యో—కృష్ణా! నీయక్కసము దీర్చుకొంటివి

కృష్ణ—భీమరాజా! చూచెదవేమి!

భీము—ఓరీ! దుర్యోధనహతకా! యుద్ధమునకు సిద్ధముకమ్ము

దుర్యో—ఇదే రమ్ము (అని యిరువు సంకులసమరము సేయుదురు)

కృష్ణ—(స్వ) ఘోరము ఘోరము. భీముఁడు మూర్ఛిల్లనున్నాఁడు

ధర్మ—అయ్యో! భ్రాతృఁడు భీమా! మమ్ము దిగనాఁడి పోవుదువా?

అర్జు—అన్నా! భీమారాజా! భయములేదు నేనిదే గాండీవము సంధించినీవెను కనే నిలిచియున్నాఁడను నీవు నిర్జింపఁబడినను నీవైరిని నేను నిర్జించి నీవెంటనే సాగనంపెదను

దుర్యో—ఓరోరి పాపాత్ములారా! నన్నొంటిగాఁజేసి యీ కికారణ్యమధ్య

సమయింపఁ జూచుచున్నారా! సరే కానిండుమిమ్మెల్లర నొక్క పెట్టున నా గదాఘాతమున కృతాంతనిశాంతంబునకు సాగనంపకుందునా! రండు మీపాపము పండినది

ఉ ఆలమునందు నూర్వుర యమాలయ మంపితిమంచు మమ్ము వా
గ్జాలములన్ హసించు మిముఁ జంపి కృతాంత నిశాంతవీధికిన్
దోలెదఁ జూడుడింక నలద్రోవది భర్తల కేడ్వ బాలగో
పాలుఁడు కృష్ణుఁ డార్తుఁడయి ప్రాణమువాయ జగంబు బెగ్గిలన్

(మూర్ఛిల్లిన భీముఁడు లేచి గద సవరించును)

కృష్ణ—ఓహో! ప్రమాద మావహిల్లినది ఈదుర్యోధనుఁడు ప్రళయకాల ప్రచండమార్తాండ మండలమువలె మండిపడుచు మహాఘోరముగా యుద్ధము సేయుచున్నాఁడు ఈతని నీపాండవపంచకము జయింపఁ జాలదు తల్లియగు గాంధారిచే నాశీర్వదింపఁబడి శత్రుసంహారమునకై వచ్చినిలిచినాఁడు ఈతనిని ధర్మయుద్ధమునఁ గెలువరాదు ధర్మాతిక్రమణమైనను ప్రాణహాని సంధిల్లినప్పుడు యోచింప పనిలేదు

తే గీ తల్లి గాంధారి యీ సుయోధనుని వజ్ర
దేహుఁడగుమని దీవించె దేవతలును
గెలువలేరన్న పాండవుల్ గెలువఁగలరె
తొడలు విఱిచినఁగాని లోఁబడ డితండు

(అని భీమునకు సౌంజ్ఞచేయును)

భీము—(గదతో తొడలలో పొడుచును)

దుర్యో—అమ్మయ్యో! ప్రాణములు పోయినవి (అని నేలఁగూలును)

పాండవులు—శ్రీకృష్ణునకు జయము జయము అని కేకలు

దుర్యో—ఛీ! దురాత్ములారా! మీరు కిరాతకులుపోవు పాపమునకుఁబోయి

పొలియుదురుగాక ఓరోరి కృష్ణా! నీవెంత యదర్మాత్ముఁడవు

చ ఎఱుఁగవా యుద్ధమార్గముల నేకము దర్మ మదర్మమిట్టిదం
చెఱుఁగవా వీరలోక మెటులేగునొ నాడు వృధూరుభాగమున్
విరుగఁగఁ గుట్టుకొట్టుమని భీమునకుజ్ఞ గనుసొంజ్ఞజేసినాఁ
డరయవు ధర్మహాని యకటా కవటంజనఁజేసి కేశవా!

ఓకృష్ణా! ఇట్టి యవినీతి యెందైనఁ గలదా? నీవు యుగయుగమునధర్మ సంస్థాపనార్దము పుట్టుచుండెదనని ఓీరములువలికినావే యిది యేనా నీదర్మస్థాపనాపరత్వము? ఇదియేనా నీన్యాయైకపరాయణత్వము? అయ్యయో! నామర్మావయవములపైయన్యాయముగఁగొట్టించి చంపితివిగదా! దురాత్మా!

కృష్ణ—ఇది ద్రౌపతీమానభంగమునాఁటి శపదముగాని నేఁడు క్రొత్తగ నీకన్యాయముచేయుటకుఁ గల్పించినదికాదు

దుర్యో—ఛీ! వదఱుబోతులారా! ద్రౌపతీమానభంగమేమిటి? మానవతికిగదా! మానభంగము మానహీనురాలు ఏవురార్వురకుఁ బత్నియైనబందకి దానికేమి మేము హానియొనరించితిమి? నన్నే మనియెగతాళిచేసినదో మీరెఱుంగరా! నీచాతినీచులారా! మీకువీరలోకమున గౌరవమెక్కఁడిదిరా? ఓకృష్ణా! నీవే యీకయ్యమునకును మావినాశనమునకును కారణభూతుఁడవు నీవలననే మాభరతవంశము కూఁకటివ్రేళ్లతోఁ బెకలింపఁబడినది

కృష్ణ—నీవు నన్ను రాయబారమునాఁడుచేసినపరాభవము మఱచిపోయినావా? దాని పలితమే యిది.

దుర్యో—అదికాదు ఇంకను కలదు. నేనది వెల్లడింపను

కృష్ణ—అంత్యకాలమున దాచెదవెందుకు?

దుర్యో—నీవు మాతో చుట్టరికము చేయవచ్చితివి. మీయాదవులతో వియ్యమందుటకు మాకిష్టములేకపోయినది.

అనార్యులైనయీపాండుపుత్రులకే మీపిల్లల నియ్యవలసి వచ్చినది నీవెల్లెలుసుభద్ర (మూర్ఛిల్లును)

కృష్ణు—చెప్పు చెప్పు

దుర్యో—(లేచి) ఓరీకృష్ణా! పాండవులకు విషాన్నము పెట్టితిమని, లక్కయింట కాల్చినామని, ద్రౌపతిని హింసించితిమని యేమేమోమృషోక్తులల్లుచున్నారే, మీరుచేసిన ఘోరము లేల చెప్పుకొనరు? వ్రేలుమడిచిన నొక్కటైన ధర్మమున్నదా! పాపీ! నీకతమునసేకదా? నేఁడీదర్మక్షేత్రమగు కురుక్షేత్రము కౌరవపవిత్రరక్తముచేనిండి భయావహమై తోఁచుచున్నది

సీ రణభీరుఁడైన పార్ధుని దువ్వి మమ్ము వం
చింపఁగా దురము సాగించినావు
చలముసేయను పార్ధ సారదిగావత్తు
నని చక్రమునుబట్టి తునిచినావు
దర్మజుచేఁ బొంకు తప్పులేదనిచెప్పి
ద్రోణునాలము కూలఁద్రోసినావు
కర్ణుని విరదుగాఁ గావించి విజయుని
చే నదర్మముగ నిర్జించినావు

తే గీ పట్టపగటిని చీఁకటి పర్వఁజేసి
సైందవుని పార్ధునెపమునఁ జంపినావు
నీవు మోసాలకెల్ల పుట్టిల్లువగుచు
భరతవంశంబు కూల్చితీ తెలిఁగు కృష్ణ.

హా! బాధ సహింపలేను (అని మూర్ఛిల్లును)

కృష్ణు—ధర్మరాజా! వాని కిన్నినీళ్లు దెచ్చి పోయుము.

దుర్యో—ఛీ ! పాపాత్ముఁడా ! కులద్రోహి ! ధర్మజా ! వ్యభిచారములు అనాచారములుచేయు నీచేతులతోనా నీవు నాకు నీళ్లుపోయుదువు? ఛీ ! ఛీ ! నాయెదుటను తొలఁగిపొమ్ము నీమోము మృషలు పలుకుటచే మలినమై మసిప్రాకినట్లున్నది

భీము—నేను నీళ్లుపోయుదునా?

దుర్యో—ఛీ ! పాపీ ! పొమ్ము

కృష్ణ—దుర్యోధనా ! నీకింకేమైన ఆసయున్నదా?

దుర్యో—కృష్ణా! నిన్ను ఈపాండవులను రూపుమాపకుండ నాయీప్రాణముపోదు

కృష్ణ—ఏటికీదురహంకారము గడియలోనుత్తరలోకప్రయాణమున కాయత్తుఁడవైన నీవు సింహప్రతిమానులయిన శత్రువుల నెట్లెదుర్కొనఁగలవు?

తే గీ మృత్యు విటకీడ్చి తెచ్చె నిన్నింక నిల్లు
పిల్లలను జూడనియ్యఁగా విడువదు రులఁ
దగిలి కోలను గుఱియైన ఖగము తిరిగి
గూటి కెగసిపోనేర్చునే కూలఁబడక

దుర్యో—ఛీ ! దురాత్ముఁడా ! నాయెదుటనుండి లేచిపొమ్ము నీవురూపముచేతనేగాక హృదయముచేతఁగూడ నల్లనివాఁడవు. (అనిమూర్ఛిల్లును) నేన పాండవము చేయకమానను

కృష్ణ—ఆహా ! వీఁడుఅవసానమున కలవరించుచున్నను అపాండవముసేయుట మాననునుచున్నాఁడు ఆహా ! యేమి వీనిపంకము ! ఏమి పట్టుదల ! ఎంత దురంతము (అని నిష్క్రమించెదరు )



# మహాభారతకౌరవరంగము

## సప్తమాంకము

రంగము -వనము

(అశ్వత్థామయు, కృపాచార్యులును బ్రవేశించియుందురు )

అశ్వ—మామా ! పుత్రవత్సలుఁడైన నాతండ్రిమరణంబునకే కన్నీరుమున్నీరుగా నేడ్చుచున్న నాకెట్టి దుస్సహమైనవార్త వినిపించితివి హా ! పాండవహతు లెంతలెంతలుచేసినారు తుదకు కురవంశపయఃపారావారమున నొక్కచుక్కైన లేకుండ హుష్షనిజుఱ్ఱివేసినారు హా ! హతోస్మి హతోస్మి నాయేలిక, నాప్రాణమిత్రుఁడు, నాశిరోరత్నము, నాసుయోధనుఁడుకూడ మిగులలేదా ?

కృపా—కొనఊపిరితో నున్నాఁడు

అశ్వ—ఏమనుచున్నాఁడు

కృపా—అపాండవము చేయువారు లేరా ! అని పలవించుచున్నాఁడు

అశ్వ—అనఁగా

కృపా—అపాండవమైనది అనునుడి చెవిఁబడుదాఁక ప్రాణము పోదనుచున్నాఁడు

అశ్వ—హా ! దుర్భరము, దుర్భరము ఎంతవాని కెంతవచ్చినది ఓరీకర్ణా ! నీవానాఁడు నాతండ్రిని కవటమునద్రుంచి తలఁదన్నిన ద్రుపదాత్మజుని కడతేర్చి నేనేగుసమయమున నీవడ్డురాకున్న నేఁడీదుఃఖకథనము పాండవులదైయుండునుగదా ! హతవిధీ ! యింతచేటు మూడునని నేను కలనైనఁ దలఁపలేదుసుమా మామా?

కృపా—

చ కురుకుల మంతరించినది కూఁకటివేళ్లనులేవు ఘోరదు
ర్భరమగు నావిషాదమిఁకఁ బాయుటయెట్లు లపాండవంబు నే
కరణిని సేయవచ్చును వికావికలై కురుసేనలీగె నె
త్తురువరదన్ రణాంగణము తోరణఁగట్టె శిరంబు లొయ్యనన్

అశ్వ—మామా ! నీకాభయము వలదు

ఉ పాండవవంశకాననము భగ్గునమండి నశించిపోవ నా
గాండివిముఖ్యసోదరులు గర్వము నీరయిపోవ నీమహా
భండనవీరశూరనిజవాహిని వాహినియై కృశింప నా
చండకరాసిచేఁ జెనకి శాస్తియొనర్తు కృతఘ్ను లందరన్

కృపా—నాయినా ! పోటుమానిసులమని విఱ్ఱవీఁగిన కర్ణాదులచేతఁగూడకాని యీకార్యము మనమెట్లు సాధింపఁగలుగుదుము

అశ్వ—మామా అట్లనెదవేమి?

కృపా—వైదికులమైన మనకీ మహాహవప్రముదవధావ్యాపార మసాధ్యమని.

అశ్వ—నీవట్లాడవలదు నీకాసంశయమున్న నిదే

మ అల బ్రాహ్మ్యంబు పరిత్యజించితిని యీయజ్ఞోపవేతంబు ము
క్కలుగావించితి కర్మముల్ విడిచితిన్ ఖడ్గంబుచేఁబూని యా
విలయాగ్నింబలె పాండవాధముల నుర్విన్ బేరులేకుండ వే
రులతోఁ దత్కులభూజమున్ బెరికిఁ దూర్తున్ జేని కామోదమున్

కృపా—నీకు దేవతలు తోడగుదురు గాక

అశ్వ—అది సరే నీతోడుగూడ మిగుల అవస్యకము.

కృపా—ఏల?

అశ్వ—నిద్రాముద్రితులైన యీపాండవహతకులను తత్సంతతిని సేనా

సమూహమును ఒక్కొక్కనిని నీవు బంధింపుము నేను చంద్రహాసము నెత్తి మొత్తిబలిగొనెదను

కృపా—ఇది యక్రమముగాదా?

అశ్వ—రెండపమార్గము లేదు అక్రమమని మనము శంకింపఁ బనిలేదు ఈ పాండవపాతకు లిట్టి వెన్నియో చేసినారు

చ శమన సుతుండు నాజనకుఁ జంపఁగ బొంకెను భీష్ముగూల్చె మో
సమున, రథంబు నెత్తుకొను సందడి పార్థుఁడు కర్ణుఁ గూల్చెఁ జ
క్రము రవికడ్డుపెట్టి తిమిరంబున సైంధవునొంచె శౌరి య
క్రమ మిదిగాదె సుప్తులను రాల్చుట యక్రమమయ్య మాతులా!
ఇంకను పెక్కులు గలవు

కృపా—నిజము నిజము

అశ్వ—అదిగాక మామా! కన్నీరుగానోడ్చుచు మఱియొకసంగతి చెప్పుచుంటి వినుము

మ కురువంశార్ణవ మొక్కచుక్కయిన లేకుండన్ హరించెన్ సుధా
కరదివ్యాన్వయదుగ్ధనిర్ఘరులు భూగర్భంబులో డాఁగఁగాఁ
బరదేశస్థులు పాండుభూసుతు లిలన్ బాలింతురే చెల్లరే
భరతక్షోణిని దాస్యశృంఖలములన్ బందించి పీడింపుచున్

మామా! ఏమనియెదవు? ఆర్యభరతమహామహులగు పురుషవతంసుల నంతరింపఁజేసి పరదేశపిశాచప్రభుత్వమునకుఁ గప్పములు చెల్లింపుచు అడుగులకు మడుగులొత్తు బానిసవై తుచ్ఛజీవనము భూభారార్థ మెన్నాళ్లు చేయ సమకట్టెదవు? నీయెడలిలో మాతృదేశప్రేమామృత మొక్క లేశమైన లేదా! నీవు భారతవీరశిఖామణుల కోవలోఁ గీర్తిగీతముల కాస్పదమైన రసస్వరూపమున మూర్తీభవించిన వ్యక్తులలో నొక్కఁడ వుగానుండ నోచుకొనలేదా? లేదు నీవు మహనీయగుణగరిష్ఠుఁడవైన

మేరుభూధరమువంటి సుస్థిరమైన దేశాభిమానవి నీరక్తనాళములయందు ఖలప్రేరితమైన దోషదూషితమహాంధకారపటలంబును జిమ్మివికావికలు చేయఁజాలు తేజస్సంసక్తమైన దివ్యజ్యోతి లేదా? కలదు లెమ్ము నావెంట రమ్ము దురాత్ములైన పాండవహతకులఁదుదముట్టింప సమకట్టిన నావజ్రసంకల్పమునకు నీవుతోడై నిలువుము సర్వము నేనే నిర్వర్తించెదను

తే గీ రుద్రుఁడును దుర్గ కడు మహారౌద్రమతిని
తలలు హారాలుగా మెడఁ దాల్చినట్లు
కటికరక్తంబు జొటజొట కారునట్లు
పాండుహతకుల తలలింకఁ జెండువాఁడ,

మామా ! కృతవర్మను బిలుచుకొనిరమ్ము పొమ్ము నాతండ్రి ద్రోణాచారితలఁ గోసిన ఓరోరి దృష్టద్యుమ్నుఁడా ! నీవెందున్నాఁడవు.

కృపా—అందరు చిక్కెదరు

(అని నిష్క్రమింతురు)

(ద్వైపాయనహ్రదసమీపమున శ్రీకృష్ణుఁడు ప్రవేశించి)

కృపా—హా ! ఘోరము ఘోరము గురుపుత్రా ! యెంతపనిఁజేసితివి ! దుర్యోధనప్రతిజ్ఞ నిర్వర్తించుటకై యెంతపాపమునకుఒడిగట్టితివి నిద్రాముద్రితులై పడియున్న పాండవ బందుచమూసమూహంబులనేగాక గర్భస్థ బాలకులగూడ దునుమాడివేసితివి ఆహా ! యెంతదారుణ మెంత దారుణము

సీ కాలాహికై వడి ఖరకరాసిని పసి
కూనల గొంతుకల్ కోసినాఁడు

కార్చిచ్చువలెవచ్చి కలసైన్యవాహిని
చెచ్చెర సమయింపఁ జేసినాఁడు
యమదూతఁబోలె యభ్యంతరావాసముల్
దొంగబాటునవచ్చి దూఱినాఁడు
ప్రళయానిలమురీతి బాందవకుసుమముల్
పేరులేకను రాల్చి వేసినాఁడు

తే గీ పాండుపంచాంకురంబులఁ బట్టిపట్టి
మారకగ్రహమట్టుల మాడ్చినాఁడు
లేశమును దయలేకయే కోశమందు
ద్రోణతనయుండు పాండవ ద్రోహియగుచు

ఆహా ! అతఁ డీవంకకే వచ్చుచున్నాఁడు

అశ్వ—తే గీ రుద్రుఁడుసు మర్గ కడు మహారౌద్రమతిని
తలలు హోరాయిగా మెడఁ దాల్చినట్లు
కటికర క్తంబు జొటజొట కారునట్లు
పాండుహతకుల తలలెల్ల పెండినాఁడ

అశ్వత్థామ (ప్రవేశించి) ఏడీ నాఱేఁడు దుర్యోధనా ! నీప్రతిజ్ఞ చెల్లినది

ఉ పాంచపసంతతిన్ నరికివైచితి తచ్చతురంగవాహినిన్
జెండితి స్త్రీలగర్భములఁ జిన్ని నిసుంగుల మాడ్చివేసితిన్
దండధరుండనై రిపుల దర్పముడించితి నీప్రతిజ్ఞ హో
కుండఁగఁ దీర్చినాఁడ కురుకుంజర శాంతివహింపు మన్నిటన్
(అని దుర్యోధనునినోటిలో నీళ్లు వదలుచున్నాఁడు )

దుర్యో—గురుపుత్రా ! ధన్యుఁడనై ప్రాణములు వదలుచున్నాఁడను నీకు శుభమగునుగాక (అని ప్రాణము వదలును )

కృష్ణ—ఆహా ! కథ యెదురుతిరిగినది పాండవపంచకమే మిగిలినది

తక్కుఁగల నెల్లవారు ద్రౌణిశస్త్రాస్త్రములకు గురియైపోయినారు ఓరీ ద్రౌణీ! నిలునిలు, అపాండవము కాలేదు ఇదేఅర్జునుఁడు వచ్చుచున్నాఁడు

అశ్వ—ఎవఁడురా? పాండవు లంతరించలేదని ముక్తకంఠము రాలుపడనెలుగెత్తి యఱచుచు వచ్చుచున్నాఁడు

(తెరలో అర్జునుఁడు వచ్చుచున్నాఁడు)

అశ్వ—రానిమ్ము వాఁడుగూడ నాకఱకుకరవాలమ్మునకు గురికాఁగలఁడు

(తెరలో పాండవపంచకముండగా అపాండవ మెట్లైనది )

అశ్వ—అయినది పాండుపంచక మున్నను చచ్చినవారనుకొనవలసినదే

తే గీ సంమమరణంబు కురులకు సంభవించె
గాన దుఃఖభాజను లింక లేనెలేరు
పుత్రమిత్రకళత్రముల్ పోయిరైన
బ్రతికియున్నారు ఏడ్వఁగా పాండుసుతులు

ఆకాశవాణి—ఇదే అపాండవము

కృష్ణ—ఏమేమి? కృష్ణుఁడున్నాఁడని యెఱుంగవా!

అశ్వ—ఈకృష్ణునికంట బడకుండ పోవుటయే లెస్స.

(అని నిష్క్రమించును )

అర్జు—(ప్రవేశించి) ఓరీ పాఱుబోతా! అశ్వత్థామ నిలునిలు ఇదేనీపీచమణంచ నర్జునుఁడు వచ్చుచున్నాఁడు ఆహా! ద్రోణాత్మజా! కుమతీ! ఎంత హంతకుఁ బాల్పడితివి?

మ జపసంధ్యాధ్యయనాదిశౌచముల హింసాపద్ధతిన్ బ్రాహ్మణుల్
తపముల్ సేయుచు నుందురుగాని యిటులీదౌర్భాగ్యునిన్ బోలెదు
ష్కపటోపాయమునన్ నిశీధినిటు మాకంఠంబులన్ గోయునే
శ్వపచుండీతఁడు పాఱుఁడే యితని నాశస్త్రాన ఖండించెదన్

అశ్వ—వీనిపై బ్రహ్మాస్త్రము ప్రయోగించెదఁగాక

కృష్ణ—అర్జునా ! అశ్వత్థామ బ్రహ్మాస్త్రము ప్రయోగించినాఁడు చూచితివా?

అర్జు—బావా ! యింకేమికర్తవ్యము

కృష్ణ—ఇది అమోఘము నీవిటుతొలఁగుము నేను వైష్ణవాస్త్రమువేసి మఱలించెదను (అనివేయును) ఈసారి అశ్వత్థామను పట్టుకొనుము

అశ్వ—(పాఱిపోవును)

అర్జు—అదే పాఱిపోవుచున్నాఁడు

కృష్ణ—పట్టుకొనియెదము రమ్ము (అని నిష్క్రమించుదురు)

తెరపడును.

భరతవాక్యము

గద్య

ఇది ఉమర్ ఆలీషాకవి విరచిత మహాభారత కౌరవరంగము

సర్వము సప్తమాంకము

సంపూర్ణము



శ్రీ విజ్ఞాన విద్యాపీఠ సభా సభ్యులచే ప్రకటింపు

# "బ్రహ్మర్షి" ఉమర్ ఆలీషా

## కవి కృత ములు

---

1 శ్రీ మహమ్మదు రసూలువారి చరిత్ర
2 దానవధ
3 మహాభారత కౌరవ రంగము (నాటకం)
4 సూఫీవేదాంతదర్శము
5 అనసూయ (నాటకం)
6 కళ
7 ప్రభాత కదావళి (కవలు)
8 విషాద సౌందర్యము
9 విచిత్ర బిల్వణీయము
10 బ్రహ్మ విద్యావిలాసము
11 స్వర్గమాత (కందార్ధములు)
12 తత్త్వసందేశము
13 పరతత్త్వకీర్తనలు
14 చంద్రగుప్త (నాటకం)
15 ఉమర్‌ఖయ్యామ్
16 మణిమాల (నాటకం)
17 శాంత
18 ఖండకావ్యములు
19 బర్హిణీదేవి
20 పద్మావతి (నవల)
21. షాతత్త్వము
22 సాధనపథము